డా॥ K. దయానంద స్వామి



శ్రీ శివరామదీక్షిత అచలఋషి సాంప్రదాయ దివ్య విమర్శనా గ్రంథము

# సత్యప్రబోధ విధానము

## శ్రీ సద్గురు




శ్లో॥ శ్రీకారాంతర ఓంకారం, శంఖచక్ర సమన్వితమ్।
పంచతన్మాత్ర సంయుక్తం-ప్రపంచ వ్యాప్తి కారణమ్।
సప్తవర్ణాంతర యుతం-సప్తావరణ భాసితమ్।
శ్రీమదాచార్యకల్పితం-వందేహమచలధ్వజమ్॥

గ్రంథకర్త :
సత్యప్రబోధనాచార్యులు
బి. బాలాజిసింగ్

• గ్రంథకర్త •

అవల గురువరేణ్యులు



సత్యప్రబోధనాచార్యులు

శ్రీ బి. బాలాజిసింగుగారు

వారి ధర్మపత్ని

శ్రీమతి రాంబాయమ్మగారు

పాతవంగల్లు గ్రామము, పిన్ కో. నెం. [redacted]

కొడవలూరు మండలం, నెల్లూరు జిల్లా, ఆం. ప్ర.

• గ్రంథకర్త •

అచల గురువరేణ్యులు



## శ్రీ బి. బాలాజిసింగుగారు

# తత్వభౌతిక శాస్త్ర సారూప్య విశ్వధర్మ నిరూపణ సత్యప్రబోధనా వాక్యాలు

# అచలఋషి సాంప్రదాయ విద్యా నిరూపణా వాక్యాలు

డా॥ K. దయానంద స్వామి



శ్రీ శివరామదీక్షిత అచలఋషి సాంప్రదాయ విహ్న విమర్శనా గ్రంథము

# సత్య ప్రబోధ విధానము

## శ్రీ సద్గురు




శ్లో॥ శ్రీకారాంతర ఓంకారం, శంఖచక్ర సమన్వితమ్।
పంచతన్మాత్ర సంయుక్తం-ప్రపంచ వ్యాప్తి కారణమ్।
సప్తవర్ణాంతర యుతం-సప్తావరణ భాషితమ్।
శ్రీమదాచార్యకల్పితం-వందేహమచలధ్వజమ్॥

గ్రంథకర్త :

సత్యప్రబోధనాచార్యులు
బి. బాలాజిసింగ్

శ్రీ శివరామదీక్షిత అచలఋషి సాంప్రదాయ చిహ్న విమర్శనా గ్రంథము

# సత్యప్రబోధ విధానము

# శ్రీ సద్గురు




శ్లో॥ శ్రీకారాంతర ఓంకారం, శంఖచక్ర సమన్వితమ్।
పంచతన్మాత్ర సంయుక్తం-ప్రపంచ వ్యాప్తి కారణమ్।
సప్తవర్ణాంతర యుతం-సప్తావరణ భాషితమ్।
శ్రీమదాచార్యకల్పితం-వందేహమచలధ్వజమ్॥

గ్రంథకర్త :
సత్యప్రబోధనాచార్యులు
పి. బాలాజీసింగ్

బహుధాన్యనామ సంవత్సరం
( తే 24-6-98 దీ)
ప్రతులు : 1,000

ప్రతులు దొరుకుచోటు :-

శ్రీ బి. బాలాజిసింగ్‌గారు
సత్యప్రబోధనాచార్యులు
పాతవంగల్లు గ్రామం, కొడవలూరు మండలం.
నెల్లూరు జిల్లా - 524 317, ఆం. ప్ర.

దాసానంద శ్రీ ఈపూరు శేషఫణిగారు
ఇంటి నెం. 27/16, రంగరాజు వీధి.
కర్నూలు - 518 001. ఆం. ప్ర



మూల్యం — రూ॥ 15-00 లు

ముద్రణ : శ్రీ శ్రీనివాస ప్రింటింగ్ & బైండింగ్
పెట్రోలుబంకుఎదురుగ బాంబేరోడ్ - బుచ్చిరెడ్డిపాళెం.

• గ్రంథకర్త •

అచల గురువరేణ్యులు



శ్రీ బి. బాలాజిసింగుగారు

తత్వభౌతిక శాస్త్ర సారూప్య విశ్వధర్మ

నిరూపణ సత్యప్రబోధనా చార్యులు

అచలఋషి సాంప్రదాయ విద్యా

నిరూపణా చార్యులు

• గ్రంథకర్త •

అచల గురువరేణ్యులు



సత్యపరిబోధనాచార్యులు

## శ్రీ బి. బాలాజిసింగుగారు

వారి ధర్మపత్ని

## శ్రీమతి రాంబాయమ్మగారు

పాతవంగల్లు గ్రామము, పిన్. కో. నెం. 5[redacted]1

కొడవలూరు మండలం, నెల్లూరు జిల్లా, ఆం. ప్ర.



శ్రీ గురుభ్యోనమః

భక్తకవి, కవితావాచస్పతి
అనుమునిగిరి ఆస్థానఅష్టమకవి
సహజాచల రాజయోగి

## దోనిపర్తి రమణయ్య

ఇచ్ఛిరెడ్డిపాళెం.

## అ ను భా వ ము

శ్రీ బ్రహ్మాద్వైశిష్ట సిద్ధాంత నిర్ధారణోద్ధారకులైన శ్రీ పగడాల వేంకటేశ్వరావధూత స్వాములవారి ప్రియశిష్యులు గురువరేణ్యులైన సత్యప్రబోధనాచార్యులు పూజ్యశ్రీ బి బాలాజిసింగుగారు నాకు గురుతుల్యులు వీరు వయోవృద్ధు లేకాదు జ్ఞానవృద్ధులు తాను తరించడమే కాదు, తనతోటి వారిని తరింపజేయవలెనని కంకణం కట్టుకొన్న అచల పరిపూర్ణ రాజయోగులు,, యోగ్యులు వీరు ముమ్ము జన్మరాహిత్య ప్రబోధము, తత్వభౌతిక శాస్త్ర సారూప్యత విశ్వధర్మ నిరూపణమనెడు గ్రంథరాజముల నత్యంత శ్రమకోర్చి తత్త్వపరిశీలనగావించి యిటు అచల పరిపూర్ణ పరబ్రహ్మము ను అటుసాంకేతిక విజ్ఞానమును జోడించి మనకు తెలియని యెన్నో విషయములను తెలియబరచిన బహుముఖ ప్రజ్ఞాశాలురు, బ్రహ్మవేత్తలు.

ప్రస్తుతము ౦ఓం యిది అచల పతాక చిహ్నముగా భావించుట సరికాదని నిశితకుశాగ్రబుద్ధితో సత్యసంశోధనమొనరించిన మహనీయులు, మహాత్ములు.

వీరి భావనకుననుకూలముగ అచల చిహ్నమును రూపకల్పనగావించితిని. లేవెరుకను ఎఱుకలేదు ఎఱుకలేదని చెప్పుట తగదనియు నంతియేకాక పై చిహ్నమునందు యెఱుక నిశ్శబ్ధము వహించినదికదా! కావున ఎఱుక ఉన్నదని చెప్పటకు వీలులేదు. అచల పరిపూర్ణ పరబ్రహ్మము నందు యెఱుక వర్జనీయము. కనుక ఎఱుకలేదని చెప్పుటకంటే లేనెఱుక అని చెప్పుట సమంజసమని అచల ఋషి సాంప్రదాయానుకూలముగా వీరు నుడివిరి. వీరికి ప్రజ్ఞాపాటవములుమెండు అందుకే రువీ అందరికీ అభివందనీయులు, పూజనీయులు,

సర్వం శ్రీ సద్గురు పాదారవిందార్పణమస్తు

అఖిల పరిపూర్ణమైన

గురుకరుణామయుడు



పంతు మునినాథంగారు

క్లాత్ మర్చెంట్ ఇప్పిరెడ్డిపాళెం.

నెల్లూరు జిల్లా.

జననం - తే 30-11-1930 ది          పరబ్రహ్మైక్యము తే 26 6-98 ది

# తెలిపలుకులు

శ్రీ శివరామ దీక్షిత అచల ఋషి సాంప్రదాయ విహ్న విమర్శనా గ్రంథం "సత్యప్రబోధవిధానము" అను నాయీ కృతిని ముద్రింపజేయుటలో మొట్టమొదట ప్రేరేపించి ధనసహాయసహకారములందించిన కర్నూలు వాస్తవ్యులు దాసానంద శ్రీ ఈపూరు శేషపాణిగారికి, ద్రవ్యసహాయమందించిన వదాన్యశేఖరులకు, మదీయ గ్రంథాభిమానులకు, శిష్య ప్రశిష్యులకు, ముఖ్యముగా నా కృతి కాకృతి నొసంగుటకు తోడ్పడిన శిష్యరత్నములగు అచల భావశిరోమణి జిడ వెంకటాద్రికి, గురుకరుణామయి అచల పరిపూర్ణులైన దండు మునినాథంకు వారి కుమారుడైన వి॥ దండుమునిరాజి మరియు సద్గురు స్వాములకు వారిశిష్యులకునాయీ కృతిని ప్రచురించుటలో నత్యంత శ్రమకోర్చి ప్రూఫులుదిద్ది, విహ్నచిత్రంబును వేసియిచ్చిన బుచ్చిరెడ్డిపాళెం వాస్తవ్యులు సహజాచల రాజయోగి శ్రీ దోనిపర్తి రమణయ్యగారికి ఈకృతిని సర్వాంగ సుందరముగా ముద్రింపజేసిన బుచ్చిరెడ్డిపాళెం, బాంబేరోడ్ శ్రీనివాస ప్రింటర్స్‌వారికి నా కృతజ్ఞతతాపూర్వక నమోసాకములు తెలుపుచు, పాఠకలోకమునకు నాయీ గ్రంథమును సమర్పించుచున్నాడను.

సర్వం సద్గురుచరణారవిందార్పణమస్తు!

గ్రంథకర్త

బి. బాలాజిసింగుగారు

తత్వభౌతిక శాస్త్ర సారూప్య విశ్వ

ధర్మనిరూపణ సత్యప్రబోధనాచార్యులు

అచలసాంప్రదాయ విహ్న నిరూపణాచార్యులు

# * బాష్పాంజలి *

సీ॥ శ్రీకరంబైనట్టి శ్రీ దండు వంశాన
జంబు మహర్షి గోత్రంబునందు,
సాధ్వీతాయారమ్మ స్వామిరెడ్డి ఘనుల
యనురాగఫలమునై యవతరించి,
విమలగుణగణాఢ్య! వేంకటమ్మను పెండ్లి
యాడి, సాధుజన ప్రియాత్ముడైన
మునిరాజు కొమరుడై ముద్దుముచ్చటదేల్ప
మల్లిక కోడలై, మమత బెంచె,

తే॥గీ॥ నాదుశిష్యరత్నంబ! సమ్మోదమొనగ
మున్నుతోడైతి వీకృతి ముద్రణకును
నమ్రగుణశీల! యో మునినాధమార్య!
పూజ్యగురు కరుణామయ! పుణ్యమూర్తి!॥

తే॥గీ॥ మంచివారిని దైవంబు మనగనియ్య
డన్నరీతిగ మముబాసి యంతలోనె
యచల పరిపూర్ణుడవునై శివమలమూర్తి!
అర్పణము సేతునయ్య బాష్పాంజలిపుడు॥

పాతవంగల్లు
తే 21-5-1998 ది

గ్రంధకర్త
బి. బాలాజిసింగ్
సత్యప్రబోధనాచార్యులు

# ప్రశంసా ప్రసూనములు

శ్రీ బృహద్వాశిష్ట సిద్ధాంత నిర్ధారణోద్ధారకుండు గురూత్తముండు,
శ్రీ శివరామదీక్షిత సాంప్రదాయకుడవధూత, విజ్ఞుండు, అమలయశుడు,
పగడాల వేంకటేశ్వర నామధేయుండు తత్త్వసంశోధనాతత్పరుండు
వారి శిష్యుడగు శ్రీ బాలాజిసింగు సనామ గురువరుండు, నయవిదుండు
పూత రసపుత్ర వంశాబ్ధి పూర్ణవిధుడు అమలశీల రాంబాయిమ్మ యాత్మవిభుడు
పరమనిష్ఠా గరిష్ఠుండు పావనుండు శిష్ట శిష్యప్రశిష్య సంసేవితుండు॥

అచల పరిపూర్ణ భావంబు నరసి, మురిసి
లోతుపాతుల నెఱిగింప లోకతతికి
దనర సత్యప్రబోధ విధాన కృతిని
శ్రీమకు నోర్చియు రచియించెఁజక్కఁగాను॥

తే॥గీ॥ అచలభావజ్ఞులకు విహ్వమరయజేయ,
విహ్వ భావంబుఁదవ్విహ్వ చిత్రితముగ,
నిందు పొందు సజచె బుధులింపుగొనగ,
అచల సత్యపరిబోధనా చార్యపునుడు॥

కం॥ అను దినము సత్యసంశో
ధనమొనరించి యచలామృతంబునునందిం
చిన గురుకావ్యంబియ్యది
తనరును నా చంద్ర భానుతారక ముగుచున్

భక్తకవి, కవితావాచస్పతి
సహజాజిల రాజయోగి
అనుమునిగిరి ఆస్థాన అష్టమకవి
దోనిపర్తి రమణయ్య

బుచ్చిరెడ్డిపాళెం
తే 26-6-98 ది

యోగనిష్ఠాగరిష్ఠులైన అచల గురువరేణ్యులు
సత్యప్రబోధాచార్యులు



శ్రీ పి. బాలాజిసింగ్‌గారు

పాతవంగల్లు గ్రామము, పిన్. కో నెం. 524 317
కొడవలూరు మండలం, నెల్లూరు జిల్లా, ఆం. ప్ర.

# తత్వశాస్త్రము - హంసవిచారణ - అద్వైత సాంప్రదాయము

మానవజన్మ జ్ఞానముకలది. గనుక మానవకోటి తొలుత నుండియూ, నేను ఎవ్వరు? భగవంతుడు ఎవ్వరు? విశ్వముఏమిటి అను విచారణ ప్రారంభించెను. ఈ విచారణకు కొన్ని శాఖలుగా భాగించవచ్చును వాటిలో ముఖ్యమైన శాఖలు రెండు.

## 1. తత్వపరిశోధనశాఖ :

ఈ శాఖ తనలోనుండు తత్వములను పరిశోధింప ప్రారంభించినది, దాని ఆధారముగా తన్ను పూర్తిగా తెలిసికొని విశ్వమునుకూడా తెలిసికొన్నది దీనిని వారి బాషలో తపస్సు అన్నారు. ఈ తపస్సు దీర్ఘముగా ధ్యానించుట మరియు స్మరించుట వలన వారు వారిధ్యేయమునకు చేరగలిగిరి. వీరినే తత్వశాస్త్రజ్ఞులనియు, ఋషులనియు పిలిచెదరు. ఈ సర్వసంగ పరిత్యాగులగు ఋషులు కనుగొన్న శృతివాక్యములు- వేదవాక్కులు ఉపనిషద్వాక్యముల వలన హిందూదేశము పుణ్యభూమి యనిపించుకొన్నది.

## 2. భౌతిక పరిశోధనశాఖ :

యీ శాఖ సృష్టిలో నుండు పదార్థమును పరీక్ష చేసి దాని యందలి, గుణ,శక్తుల ప్రభావములను కనుగొని దాని యొక్క విమర్శ ప్రయోగము, ప్రయోగముల ద్వారా, నిర్ణయించిరి. దానిచే సౌఖ్యములు ఆనందములు పొందుచున్నారు. వీరిని భౌతిక శాస్త్రజ్ఞులని పిలుతురు. యిట్లు మన పెద్దలు వెలువరించిన జ్ఞానమును యితర దేశస్తులు వస్తు పరిశోధన క్రింద పరిశోధనలు చేసి వస్తువు యొక్క, స్థూల. సూక్ష్మతను, వాటియొక్క

ఈ విమర్శలో ప్రతి అవయమును పరిశోధన చేయుచూపోయిరి. కాళ్లు చేతులు మొదలగు అవయవములు తమంతట తాము చలనముకలవి కావనియు, వాటికి చలనముయిచ్చునది ఏదో యింకొకటి కలదనియు, గనుక అవి శక్తిలేనివని, నిశ్చయించి తనలోశక్తిగలది ఏది? అని పరిశోధనచేయ దొడంగిరి. వారు తపస్సు చేయుచూవున్న. ఆలోచన చేయుచూ వున్న. నిద్ర పోవుచూవున్న నిరంతరము శ్వాస ఆడుతునే వున్నదని కనుగొనరి. కనుక దానికి వున్న తమైన ప్రణవనాదమిడిరి. దాని సహాయమున సర్వము తెలిసికొనవచ్చునని దానినిగూర్చి పరిశోధన ప్రారంభించిరి బలవంతముగా ప్రణవమును నిలుపుదలచేయుటకు ప్రారంబించిరి. కానీ సాధ్యపడలేదు. కారణమేమనగా ఇది యింకొక దానిపై ఆధారపడియుండునని గ్రహించిరి. అదియే మనస్సు, జ్ఞాత, యని తెలిసేది వాటిచే ప్రణవముతోకూడా ప్రయాణము చేయుటకు ప్రారంబించిరి. దాని గమ్యస్థానము కనుగొనుటకు ప్రారంబించిరి

దానిని వేగముగా పీల్చుటలో తీవ్రతకలగుచున్నదనియు అట్టి తీవ్రత తగ్గుకొలది దానివేగము మందగించుట కనుగొనిరి. యిట్లు అభ్యాసము చేయుటచే దానిని వెంబడించి దాని గమ్యస్థానము చేరగలమని కనుగొనిరి యిట్లు అది చేరగల ఆఖరి స్థానము నిశ్శబ్దమైన బయలుస్థానమనియు అందులో ఈ ప్రణవనాదం లీనమగుచున్నదనియు అచ్చట నుండి తిరిగి వచ్చుచున్నదనియు కనుగొనిరి. దీని రాకడ పోకడకు పై గమ్యస్థానమే ఆధారమని తలంచిరి, యిట్లు పయనించుటలో దానిని గమనించిరి దానిని గమనించుటలో దానిశక్తిని నిర్ణయించిరి ఎట్లనగా అదిసర్వేంద్రియములలో చరించునప్పుడు వాటికి చలనముకలిగించి ఆవరించియున్నదనియు వాటినుండి వదలి వాటినుండి పయనించు సూక్ష్మ మునుకూడా ఆవరించి గమ్యస్థానము చేరులోగా మేఘములు

గుణశక్తులను వెలువరించి వాటివలన వుపయోగమును నిర్ణయించిరి దాని వలన పదార్థము నశించదనియు ఒక రూపము నుండి యింకొక రూపమునకు మారుచూ [Matter is industrictable] సుఖ దుఃఖములకు కారణమైయున్నదని తెలియజేయుచున్నారు.

యిక అచల ఋషుల సిద్ధాంతామేమనగా పై రెండు విషయములు యదార్థమేననియు వాటివలన లే నెరుకను, వస్తు నిశ్చయముగా తెలిసికొనుటకు ఏర్పడినదనియు మానవునికి ప్రసాదింపబడిన జ్ఞానముచే, యీ లేనెరుక- సుఖ దుఃఖము గల సృష్టికి మూలమనియు, కానీ దీనికి మూలము లేదనియు, అందువలన జనన మరణములు తొలగుటకు పరిపూర్ణ భగవదన్వేషణ అవసరమనియు నిర్ణయించిరి గనుక గురుకుల వాసములుఆచరణీయముగా సంస్కరింపబడవలసియున్నది

యిక తత్వ శాస్త్రజ్ఞులను గూర్చి కొంత తెలిసికొందము. మొదటి నుండి వీరు కొన్ని ప్రశ్నలతో వీరి పరిశోధనను ప్రారంభించిరి. దేవుడనగా యెవరు? ఆయనకు యీ సృష్టికి ఏలాంటి సంబంధమున్నది? నేను అనగా ఎవ్వరు? అను విషయమై పరిశోధనలను ప్రారంభించిరి. మొదట తపస్సును ప్రాతిపదికగా గైకొన్నారు తపస్సు అనగా తీవ్రమైనధ్యానము పరిశోధనవలనదేని నైనను తెలిసికొనవచ్చునని వీరి సిద్ధాంతము వీరి సిద్ధాంతము ప్రకారము. వారు అచలనమై వస్తువు, వున్నదని కనుగొనిరి. మొదట చలనమైన వస్తువు తో తాము ఏర్పడివున్నాము గనుగ దాని సహాయముచే అచలనమైన వస్తువువరకు పయనించి విషయముతెలిసికొన వచ్చుననినిశ్చయించిరి. అందు వలన తనలో చలనమైన వస్తువు, అచలమైన వస్తువుతోసంబంధము కలదియేది? అని విమర్శన ప్రారంభించిరి.

నక్షత్రములు, సూర్యుడు, చంద్రుడు మెరుములూచూపట్టి తరువాత నిశ్చలమైన ప్రకాశవంతముగానుండు బయలుప్రదేశమును చేరుచున్నదని పరిశోధనలవలన కనుగొనిరి.

యింకనూ యీ హంస సంచారము ఆధారము మొదలు సహస్రారము వరకు సంచరించుటలో ఒక్కొక్క మెట్టునకు అధి దేవతలను పెద్దలు నిర్ణయించి యున్నారు. దీనిని బట్టి ఆలోచనచేయగా ఆ అధి దేవతలలో కూడా యిది సంచరించుచున్నదనియు తెలియు చున్నది. ఆ అది దేవతలలో, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరస్థానములు కూడా వున్నందున అట్టి వారలలో కూడా యీ హంస సంచారముండి వారిని కూడా యెరుగుచున్నదని తెలియవలెను. దానిని బట్టి వారి నిర్ణయము ఎలా యేర్పడినదనగా, యీ ప్రణవము వ్యష్ఠి యొక్క సర్వేంద్రియములను, బ్రహ్మాండములో నుండు సర్వమును క్షర పురుషుడుగా [ప్రాణముగా] ఆవరించి ఆకర్షణద్వారా రక్షించుచున్నదనియు సూత్రాత్మగా నున్నదనియు సంస్కారములను తన వెంటతీసుకొని పోవుచున్నదనియు దాని వలన అది భగవదాంశమనియు, యీ భగవదాంశము, వున్నతమైన, శక్తివంతమైన ప్రదేశమును చేరి మరలా అచ్చటి నుండి క్రిందికి దిగి వచ్చుచున్నదనియు కనుగొనిరి. అట్టి శక్తి దీనిదా లేక యిది పోయి చేరుస్థానముదా? అని పరిశోధన చేయదొడంగిరి యిచ్చట భిన్నాభిప్రాయములు ఏర్పడినవి యెట్లనగా కొందరు యిట్టి ప్రణవమే భగవత్ స్వరూపము గనుక స్వస్థానమునకు పోవుచూ తిరిగి వచ్చుచున్నదనియు నిర్ణయించిరి కొందరు మహానీయులు సాధనములద్వారా అచ్చటనే నిలచి అచ్చట సాక్షిని సేవించుచూ నుండ వచ్చునని తలచిరి. అట్లు అభ్యాసము చేయగా అట్టి నిలకడ శాశ్వతము కాదనియు తిరిగి రావలసినదేననియూ నిర్ణయించిరి. అట్టి వారలలో శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారు ఒకరనియు, ఆ మహానీయులు కూడా జీవ

సమాధి పొంది తిరిగి వచ్చెదననియూ, భార్యను పసుపు కుంకుమలు తీయవద్దని చెప్పి యుండిరి. మరి కొందరు ఏమనినారనగా యిది యెందులో చేరుచూ తిరిగి వచ్చుచూ నున్నదో అదే మహాశక్తిగల దైవస్థానమనియూ అచ్చటనే యీ సృష్టి అంతయూ దాగి తిరిగి వచ్చుచున్నదనియూ అదియే ఆత్మస్థానమనియూ, ఆధారస్థాన మనియు నుడివిరి. యోగులు పై హంస క్రమమంతయూ యోగాభ్యాసమను సాధనచే అభ్యాసము చేయవలెనందరు.

రెండవ ప్రకరణము

## అచల ఋషుల చిహ్నము . ఎరుక విచారణ . మహాద్వైతము

అచల ఋషులు పై నిర్ణయమంతయూ బోధవలన తీర్చవచ్చునందురు. యిందుకు వుదాహరణముగా గీతా వాక్యము చూడుడు.

13 26 శ్లో॥ అన్యేత్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే
తేఽపిచాతితర న్త్యేవ మృత్యుం శృతి పరాయణాః॥

॥ కొందరీయాత్మతత్వమును యెరుంగ జాలక గురూపదేశము నంది వుపాసించుతా చున్నారు. వీరు కూడా గురూపదేశమున నిష్టులై మృత్యుమయ మగు సంసారమును అతిక్రమించుచున్నారు.

గీత 4.34 శ్లో. తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
వుపదేక్ష్యంతితేజ్ఞానం జ్ఞానినః స్తత్వ దర్శినః॥ గీత.

తా॥ తత్వవేత్తలైన జ్ఞానులు నీకు జ్ఞానమును వుపదేశించెదరు. అజ్ఞానమును నమస్కారము చేతను సమయము చూచి అడుగుట చేతను గురువాజ్ఞను పాటించుట చేతనుపొందగలవు

## శ్రీ శివరామ దీక్షిత అచల ఋషి సాంప్రదాయ చిహ్న విమర్శనా గ్రంథము

## సత్యప్రబోధ విధానము

శబ్దమచ్చటనే బయలుదేరుచున్నదయు అట్టి పై నాదమునే ప్రణవనాదమనియూ నిర్ణయించిరి. శక్తివంతమై వున్నతమై. ఆధారమైయుండు ఆత్మశక్తిచే అచ్చట ఆకాశముయొక్క శబ్దసూక్ష్మ భాగము వాయువుయొక్క స్థూలభాగమునందు పై చెప్పబడిన శబ్దాత్మకము ధ్వన్యాత్మకమై ఓంకారముగా ప్రజ్వరిల్లి సూత్రాత్మయై, సమాన, వ్యాన, ఉదాన, ప్రాణ, అపానగుణములచే వ్యష్టిసమిష్టులను ధరించి భరించుచున్నదని తెలిసేది, తదుపరి వాయువుయొక్క సూక్ష్మగుణము అగ్నియొక్క స్థూలగుణముచే సృష్టిని వెలిగించి అందావరించియున్నది. యిది సర్వప్రపంచ మనుగడకు ఆధారమై జలము, పృథ్వియందు సకలజీవరాసులు వుద్భవించు అవకాశము కలిగియున్నదని గ్రహించిరి తదుపరి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలము, జలము నుండి పృథ్వి, ఏర్పడిన విధానము కనుగొనిరి, పంచభూతములను తెలుసుకొనిరి. తరువాత వాటివలన శబ్ద, స్పర్శ, రూప, రస గంధ గుణములు, వాటిననుసరించియుండు మహా, ఆది, జ్ఞాన, ఇచ్ఛా క్రియాశక్తులు, వాటి ఆవరణము, మహాకాశ, దహరాకాశ, నిరవయాకాశ, సూర్యాకాశ, భూతకాశములను వరుసగా కనుగొనిరి. యిట్టి విత్తుచెట్టు వంటి రాకడ పోకడగల విశ్వములోని జనన మరణ పద్ధతిని తెలుసుకొనిరి తరువాత నేతి నేతి మహావాక్యములచే షోడశిని నిర్ణయించిరి.

దీనికి తార్కాణముగా భాగవతమునందు వ్రాయబడియుండు.

కం. ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల నుండు లీనమై, ఎవ్వనియందుడిందు పరమేశ్వరు డెవ్వడు మూలకారణం బెవ్వడనాది మధ్యలయుడెవ్వడు. సర్వము తానెయైన వాడెవ్వడు వాని నాత్మభవు ఈశ్వరునే శరణంబు వేడెదన్॥ = ॥ మరియొక నిదర్శనము గమనించుడు భాగవతమున ఏకాదశ స్కంధమునందు విదేహుడను వానికి అంతరిక్షుండను ఋషిశ్రేష్ఠుడిట్లనియె—"అవ్యక్త నిర్గుణ పరబ్రహ్మమునందు తనకు విపర్య

యంబుగా (తారుమారుగా) జననంబైన జ్ఞానంబే విష్ణుమాయయనంబడు పరమేశ్వరుం డట్టి మాయచేత జగంబు నిర్మించి నిశ్చింతుండై యుండు" అని చెప్పబడియున్నది.

తను చతుష్టయం—జీవుని గురించి విపులముగా తెలియుటకు, 1. అతని స్థాన మెద్ది. 2. స్వభావమెద్ది 3. స్వరూపమెద్ది అను విషయములు విపులముగా తెలియ వలసియున్నది.

1. అతని స్థానమును గూర్చి తెలియుటలో, స్థూల శరీరము, సూక్ష్మశరీరము కారణ శరీరము మహాకారణ శరీరములని స్థానములుగా గోచరించుచున్నవి

2. ఇక అతని స్వభావము తెలియుటకు, జాగ్రదావస్థ. స్వప్నావస్థ, సుషుప్త్యావస్థ తురీయావస్థలనుబట్టి తెలియుచున్నది.

3. ఇక అతని స్వరూపము తెలియుటకు దీని సంచారమునుబట్టి తెలియును.

గనుక మొదట స్థూలశరీరమునుగూర్చి విచారింతము. ఈ స్థూల శరీరము 25 తత్వములతో కూడినదిగా చెప్పబడియున్నది. ఈ స్థూలశరీరమునందు జీవుడు సకల వ్యవహారములు జరుపుకొనుటచే జాగ్రదావస్థకలవాడని తెలియుచున్నది యిచ్చట అతని స్వరూపము ఏర్పడుటకు అవకాశమున్నది ఎట్లనగా జీవుని యొక్క కర్మ అనగా పనినిబట్టి త్రిగుణ బీజములు ఏర్పడి అతనికి రాబోవు స్వరూపమునకు ఆస్కార మై యున్నది. ఈ అవస్థాభిమానియగు ప్రత్యగాత్మ విశ్వుడని వ్యవహరింపబడుచున్నా డు. అతనికి చిదాభాసుడనియు పేరుగలదు. యిచ్చట జీవునియొక్క భీజభావమునకు ఆస్కారమున్నది.

2. సూక్ష్మశరీరము :- ఈ శరీరము సమాన వ్యాన ఉదాన. ప్రాణ, అపా నములను ప్రాణేంద్రియములు 5 శ్రోత్ర, త్వక్కు, చక్షు, జిహ్వ ఘ్రాణములను

జ్ఞానేంద్రియములు 5. వాక్కు, పాణి, పాద, గుహ్య, గుదములను కర్మేంద్రియములు 5. మనస్సు, బుద్ధి కలసి, మొత్తం 17 తత్వములు చేరి సూక్ష్మ శరీరమగును. యిది సూక్ష్మ రూపముగా ఏర్పడియున్నది. కనుక దీనిని సూక్ష్మశరీరమని వ్యవహరింతురు. యిదియే జీవుని యొక్క స్వప్నావస్థ స్వభావము. యీ అవస్థలో జీవుడు మేల్కొని యుండుటలేదు. కాని మేల్కొని యుండి నప్పుడు జరుగు లక్షణములన్నియూ యిందు కనిపించుచుండును. యీ అవస్థలో కనపడు విషయములను బట్టి జీవుడు ఆయాస్థానములలో సంచరించుచున్నట్లుగా కనపడుచున్నది, అదియునుగాక మేల్కొనియుండునప్పుడు ఏమేమిజరుగుచుండునో ఆవిషయములన్నియు ప్రత్యక్షముగా జీవుడు యీ అవస్థయందు చూచుచుండును యిట్లు చూచుటలో రూపములు ప్రత్యక్షముగా కనుపడు చుండును గాని అవి నిజమైన రూపములు కావని భ్రమరూపములని మేలుకొనిన తరువాత తెలుసుకొనును, మరియు జాగ్రత్త అవస్థలో బయపన లేక చూచిన విషయములే కనుపడుచుండును. దీనిని బట్టి యీ అవస్థను పరిశీలించగా పై జాగ్రదావస్థలోనివనులే యిందులో ప్రతిబింబించినట్లు ఎర్పడుచున్నవి. కనుక జీవుడు స్వస్థానమును వదలి యితరత్రా కూడా వుండుననియు అట్టి అనుభవములే స్వీకరించుచుండుననియు అట్టి అనుభవములు జ్ఞాపకముంచుకొని యుండు స్థానముగా యిది ఏర్పడు చున్నది యీ స్థానములోని విషయములు మరలా స్థూల స్థానములోనికి వచ్చి తెలియబడుచున్నవి. చూడుడు, కలలో దొంగలు వచ్చిరనుకొనుడు ఆకలలో జీవికలలో నుండు దొంగలను పట్టుకొనుటకు యితరులను పిలుచును కాని ఆశబ్దము కంఠమును దాటి వచ్చిన పిదపనే బాగుగా వినపడి, తక్షణమే జీవిమేల్కొని కలలోని విషయములను కలయని తెలుసుకొనును. కనుక మెలుకువ స్థానముననే అవి తెలియబడుచున్నవి. సూక్ష్మస్థానమున తెలియబడుటలేదు. కాని విషయములున్నవి ఆస్థానమే మనో బుద్ధి స్థానము గనుక దీనికి లింగ

శరీరమని పేరు, యీ అవస్థాభిమానియగు జీవుడు ప్రత్యగాత్మయనియు తైజస్సుడనియు పిలువబడుచున్నాడు. దీనికి స్థానము కంఠము మరణావస్థకూడా యీలాగేనని భావించుము

3. సుషుప్తి అవస్థ-కారణ శరీర నిర్ణయము — యీ అవస్థయందు జీవుడు నిద్రించుచుండును. ఈ నిద్రలో ఏమియు తెలియబడక అజ్ఞానములో నుండును కాని నిద్రమేలుకొన్న తరువాత హాయిగా నిద్రపోయితిననియు లేక సరిగా నిద్రపట్టలేదనియు తెలియజేయుచున్నాడు. ఈ అవస్థలో మనోబుద్ధి ఏకరూపముగా నుండుటను బట్టి అజ్ఞానములో నుండినను హాయి తెలియబడుచున్నది. యీ అవస్థలో జీవుడు హృదయస్థానమున నుండును. యీ అవస్థలో నుండు అనుభవమును జాగ్రత్త స్థానమునకు వచ్చిన పిదప తెలియజేయుటను బట్టి యిది జీవుని జాగ్రదావస్థ యందలి కర్మానుభవమును తెలియుటవలన కారణశరీరమను పేరు.

4. తురీయావస్థ :— మహా కారణ శరీర నిర్ణయము :—
యీ అవస్థయందు జీవుడు హృదయస్థానము నుండి పూర్ధ్వ పరిణామము నొంది మూర్తి స్థానమున పై భాగమున నిలిచియుండును యీ అవస్థ యందు జీవునకు కర్మానుభవము తెలిసియుండును. కనుక అవస్థాత్రయము అన్నింటికీ యిది మహాకారణమని చెప్పబడును.

కం. మరుపుసుషుప్తి యుమూర్ఛయు - మరణంబు సమాధియనుచుమానవు
లెరుకన్ - దొరిగిననొరునిశరీరము - నెరిగెదదానరుడు - మేనునెరుగా
డోయన్నా - తననైనతా - నెరుగడోయన్నా - యెరుగాకుండితెయేమి
తిరిగిపుట్టుచునుండు - తిరిగిపుట్టడువాడె - గురుబోధగలిగితె - యెరు
గడోయన్నా - తననైనతా - నెరుగాడోయన్నా॥

1. మరుపు, సుషుప్తి, మూర్ఛ, మరణము, సమాధి ఇవి ఒకే అవస్థగా తెలియవలెను ఎట్లనగా మరుపు నుండి జ్ఞప్తికి, సుషుప్తి నుండి మెలకువకు, మూర్ఛనుండి స్పృహకు సమాధినుండి తెలివియూ, మరణమునుండి పుట్టుకయు కలుగుట ప్రత్యగాత్మ యొక్క విధియైయున్నది. యిచ్చట మరణమునుండి పుట్టుకకుగల అవస్థను గురువు వలన తెలియవలసియున్నది. యిచ్చట మరణావస్థనెందిన జీవి తన కర్మవలన ఏర్పడు తన రూపమును బ్రహ్మాండములో నిర్ణయింపబడి మరలా వ్యష్ఠిగా జన్మించును.

2. పిండబ్రహ్మాండములు ఒకే సూత్రము ననుసరించి యుండుటంబట్టి వ్యష్ఠి తనువునుండి బయలువెడలిన సూక్ష్మశరీరములోనుండు జీవుడు బ్రహ్మాండములో తన రూపమును ధరించుకొని మరల వ్యష్ఠిగా జన్మించును. యిది బ్రహ్మాండములో జరుగు మార్పు అనితెలియవలెను.కోశ మనగా పొరయని సామాన్య అర్ధము. జీవుడు బ్రహ్మాండమున అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ, హిరణ్మయ కోశములలో తన రూపు నిర్ణయింపబడి మరల జన్మమునకు వచ్చును. ఉదాహరణముగా ఒక యంత్రములో వేయబడిన ముడిసరుకు ఆయంత్రములో దానిరూపు దిద్దబడి ఎలా ఇతర వస్తువుగా బయటికివచ్చునో ఆ విధముగ భావించవలెను..

విరాట్ పురుషుని, అన్న మయకోశ ధర్మము, జనన మరణములు, ప్రాణమయకోశ ధర్మము, ఆకర్షించుట, మనోమయకోశ ధర్మము కర్మానుసారముగా ఫలానుభవముల సృష్టించుట, విజ్ఞానమయకోశ ధర్మము, సర్వము తనయందు లయముజేసికొనుట; స్వయంప్రకాశమను పరబ్రహ్మ నిర్ణయం, కేవలం ప్రకాశవంతముగా నుండుట యిట్టి కోశధర్మముల ననుసరించి ఈశ్వరతను చతుష్టయములో, విరాట్, హిరణ్యగర్భ స్వరాట్, సాక్షియందు సంచరించి విరాట్ స్వరూపుని భోగసాధనాముఖంబులందు తన

పూర్వసంకల్పముల ననుభవించి మరల 84 లక్షల జీవరాసులలో తనకోరిక ననుస రించి సంచితరాసిని మూటగట్టుకొని తను చేరవలసిన రూపమున జన్మించును. పై సంద ర్భములోని గతులన్నియు గురు రహస్యములు కనుక గురువుల వలన తెలుసుకొనుము.

ఈ సందర్భమున క్షరాక్షరోపాది ద్వయదోషరహితమేవ విచారస్యఫలం అని శ్రీ శివరామదీక్షితులవారన్న విషయం గమనించుడు! ఈ సందర్భములో శ్రీ భాగవతుల కృష్ణదాసుగారు రచించిన కందపద్యములకు హెడ్డింగ్ క్షరాక్షరోపాది ద్వయదోష రహిత పరమతత్వమనియూ, కందార్థములకు శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణమనియుశ్ లవివ్రియున్నారు గమనింపుము.

## క్షర, అక్షర. అవ్యయ పురుషోత్తముల నిర్ణయము

క్షరము:- నవవిధ ద్రవ్యములగు పదార్థమును క్షరమందురు. ఈక్షర పదార్థముయొక్క వికారము క్షరితలగుటవలన ఇది ఘనపదార్థము నుండి ద్రవపదార్థ ముగను, తదుపరి వాయుపదార్థముగను, మరల వాయుపదార్థమునుండి ఘనీభవించి ఘనపదార్థము వరకు పయనించును. ఈ క్షరమునుండి ఎన్ని వికారములు కలిగినా యిందు సర్వమునకు కారణమైన ఆత్మ ఏ వికారము నొందదు. ఈ క్షరము చూడగలముగాని యిందుడు అక్షరము సూక్ష్మరూపములో నుండుటంబట్టి క్షరాక్షరములని తెలియసడుచున్నది. యీ క్షరాక్షరములను ఒకదానినుండి యింకొకటి వేరుచేయుటకు వలనుపడదు. క్షరుడు స్థూలరూపము అక్షరుడు సూక్ష్మరూపము గనుక స్థూల సూక్ష్మములు అవిభక్తమై కలసియుండునని తెలిసేది.

15-16 శ్లో. ద్వావిమౌపురుషౌలోకే! క్షరశ్చాక్షర ఏవచ॥
క్షర సర్వాణిభూతానీ॥ కూటస్థోక్షర ఉద్యతే॥ గీత.

యీ శ్లోకమునందుండు ప్రకారము అన్ని భూతముల యందు క్షరము నుండగా కూటస్థుడుగా అక్షరుడున్నాడని చెప్పబడుచున్నది. గనుక క్షర సర్వాణి భూతాని కూటస్థో అక్షర ఉచ్చతే అని చెప్పబడియున్నది. క్షరము భూత గ్రామ, దేవగ్రామ ఆత్మగ్రామ అనువాని పురము. యిట్టి పురములో నివసించు బ్రహ్మ ప్రాణమునకే పురుషుడందురు. యీ పురుషుడు, అవ్యయుడు, అక్షరుడు క్షరుడు అని మూడు వివర్తములు యిందు క్షర పురుషుడు సర్వ వికారసంఘమునకు వుపాదాన కారణము, సృష్టి, స్థితి లయములంతటికి ఆత్మ ఆధారము. చర్మ చక్షువులతో, ఈ భౌతిక విశ్వమే చూడగలముగాని తదాలంబనమగు ఆత్మాక్షరము చూడజాలము కనుక దీనిని అవ్యక్తమందురు. యీ అవ్యక్తము నుండియే మహత్తు, మహదహంకారము. పంచ భూతములు కలిగెను శరీరత్రయము, ప్రజావర్గము, విత్తవర్గము అను ఐదు కళలు కలవాడు క్షరుడు.

అక్షరుడు = క్షరము యొక్క వైకారికములకు కారణము అక్షరుడు ఎట్లనగా—మట్టి కుండలలో కుండ నిర్మాణమునకు చక్రము మొదలగు వుపకరణములగు, కారణములు ఉండవలెనుగదా ఆ కారణమునే నిమిత్త కారణమందురు. ఈ విధముగా భూత భావనుడగు అక్షరుని. భావనచే క్షరముద్వారా వైకారిక విశ్వముదాల్చును అక్షరునికళలు 5. బ్రహ్మ, విష్ణు, యింద్రుడు, అగ్ని, సోముడు; యీ అక్షరము అవస్థా భేదములు రెండు విధములు:—

1. సర్వశక్తి గల అవ్యక్తావస్థ.

2. వుత్పత్తి, సర్వశక్తి గల వ్యక్తావస్థ, యిదియే అహం కృతి.

కం. అహమే తానువీ విశ్వం—బహమేజీవేశ్వ ఋలన సహమేతదైక్యం॥

బహమేయహముకు మూలం-బహమణగిన నక్షరమగునని, యనఘ చరిత్రా ॥-॥

దీని నుండియే సర్వభూతయోనులందు, స్థూల సూక్ష్మశరీరము లగుపడు చున్నవి. దీని నుండియే యెల్ల ప్రజలు పుట్టుక యీ మహదాక్షరకార్య విశేషమే—

14-3 శ్లో॥ మమయోనిర్మహద్బ్రహ్మ! తస్మిన్ గర్భం దధామ్యహమ్!
సంభవస్సర్వభూతానాం! తతోభవతి భారత॥ గీత.

తా. త్రిగుణాత్మకమయిన మాయ నా యొక్క గర్భస్థానము నందు హిరణ్య గర్భుడు మొదలగు సకల ప్రాణుల యొక్క జన్మకు కారణమగు బీజమును క్షేత్ర క్షేత్రజ్ఞులనెడి ప్రకృతి ద్వయము యొక్క శక్తిమంతుడనై నేనుంచుచున్నాను.

13-27 శ్లో॥ సమం సర్వేషు భూతేషు! తిష్ఠంతం పరమేశ్వరమ్!
వినశ్యత్స్వవినశ్యంతం! యః పశ్యతి స పశ్యతి॥

అవ్యయం = అక్షర పురుషుల కంటె పరమగు అవ్యయమను ఆత్మ యొక్క టున్నది. యిదియే క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత పరమతత్వం. అవ్యయుడు లేనిచో ప్రకృతి గడ్డిపోచయుకదలదు. అవ్యయుని గర్భమందు యెల్ల వివర్తములు యిమిడి యున్నవి విశ్వకర్త, భర్త, ధర్త, క్షరాక్షరులకు సర్వజీవ జగత్తులన్నియు నతడే, సర్వం ఖల్విదం బ్రహ్మ, అవ్యయుడు అక్షరపురుషుల కంటె వ్యాపకుడే కాని మహామాయచే పరిచ్ఛిన్నమైనవాడు మాయావిశిష్టుడు.

15-17 శ్లో॥ ఉత్తమః పురుషస్త్వన్యః! పరమాత్మేత్యుదాహృతః!
యోలోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥ గీత.

తా. ఉత్తమ పురుషస్త్వన్య అని మరి యొకడును చెప్పియున్నారని భ్రమచెంద నక్కర లేదు. సర్వజ్ఞుడును లోకముల తన దగు మాయాశక్తిచేత ప్రవేశించి ధరించు వాడును, క్షరాక్షరులకంటే విలక్షణుడును శ్రేష్టుడును అగు పురుషుడు పరమాత్మయని వేదములచేత చెప్పబడుచున్నది.

మహామాయయందు విసర్గత, యోగమాయ పుదయించును యిందు అవ్యయ అక్షర, క్షర, అను మూడు దాతువులుకలవు.

మాయా ప్రకృతి ఒక్కటి కాదు, మాయయన్నది, పరాత్పరునికి సంబంధించినది. ప్రకృతి యన్ననో శోడశ పురుషునితో సంబంధము మాయయనగా అమితమును మితము గావించుట, ప్రకృతి యనగా మితము గల విష్కళ పురుషుని షోడశ కళలం జేయుట. యీ ప్రకృతి యందు రస, బలములనూ తత్వములు గలవు. అందు వలన దానికి అమృతము, మృతువు అను రెండురూపములు గలవు అమృత ప్రకృతి అక్షరము. మృత ప్రకృతి క్షరము అక్షరము పరిణామికాదు. క్షరమే పరిణామి. మూల పురుషుడు అవ్యయుడు,నిష్కళుడు కాని, అక్షరవ్యాపారముచే అతనియందు రస, బల, చితులు కలుగును. రసచిత ఆనంద విజ్ఞాన రూపము, బలచిత ప్రాణవాగ్రూపము, చేతన రూపమగు అక్షరముచేనగు యీ చితిచే నీమనోమయావయ్యుడు పంచకళలుగలిగి చిదాత్మయనబడును. ఆనంద,విజ్ఞాన, మనః, ప్రాణ, వాక్కులను 5. కళలుగలవాడు అవ్యయుడు.

## సత్యప్రబోధ విధానము

అవ్యయుని మనస్సు నాలుగు విధములుగా పరిణమించును.

1. బహిర్మనస్సు, 2. అంతర్మనస్సు, 3. చిత్తాఖ్య మనస్సు, 4. అవ్యయమనస్సు, యిది ఆత్మరూపము చూచే మనస్సు చూడబడు ఆత్మ అను ద్విపుటులు. త్రిపుటులు ఆత్మగానే నిలుచును యిదే మనోరహితం ఆ మనస్సు ప్రశాంతము. అక్షరుని దైవీమాయమానస ప్రపంచములో సంబంధము ఆశక్తికి మూల ప్రతిష్ఠ మానవభావం ఈ ఆశక్తిని తొలిగించవలెనంటే సాధ్యముకాదు.

7-14 శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే. గీత.

గీ. వినుము దైవమాయ దురత్యమనిరిగాన
కష్టమౌ దాటుట కనన్య నిష్ఠ బూని
పూర్ణభక్తి శరణ్యము ప్రబలునేని
మాయదావంతనది విడుమాట నిజము

ప్రకృతి యందు లీనమౌట ఆనందమయము గనుక గురుస్వరూపమును ప్రకృతి యందు లీనముకానిదిగా తలంచిన, ప్రకృతి మనస్సుతో సంబధము లేక మాయామనస్సు నశించును. కనుక ప్రకృతి మనస్సుతో సంబంధము పూర్ణ గురుత్వములో నుండదు.

## పరాత్పరుడు :-

అవ్యయుడు, అక్షరుడు, క్షరుడు, వీరలు ముగ్గురు అన్యోన్యముగా నుందురు. పరమపురుషుడొక్కడే త్రిపురుషైక్య పురుషరూపుడు. పై త్రి పురుషేక పురుష రూపులు

కాలానుసారముగా ఉత్పత్తి స్థితిలయములను బోదింతురు. బుద్బుదములకు సముద్రము వలె నిరుపాది సముద్రమును ఆధారముగా గొని, ఉపాది అలలు రేగినట్లు నిరుపాది పరమ పురుషుని ఆధారముగా గొని, ఉపాదులగు అవ్యయ, అక్షర, క్షరము కాలాను గుణముగా ఉత్పత్తి, స్థితిలయములు బోందింతురు. మహా మాయచే పరిచ్ఛిన్నుడైన పురుషోత్తముడు యోగమాయచే, అవ్యయ, అక్షర, క్షరులైరి.

దీనికంతయూ ఆ యతమైన పరాత్పర భావము తెలియునో అప్పుడే యోగ మాయా వరణమైన క్షరాక్షరోపాదులు తొలగును. ఈ పరాత్పరుని యందు మితిశేయ సక్యముగాక సహచర భావముగా తలంతురు.

ఆ పరమపురుషుని కళ ఒకటి, అవ్యయుని కళలు 5, అక్షరుని కళలు 5 క్షరునికళలు 5. మొత్తం శోడశయిందురు. యీ త్రి పురుష పురుషాత్మ, దేవుని ఎరిగినవారు శరీరబంధ విముక్తులగుదురు, అనగా అశరీరులగుదురు.యీ విధానము అచల ఋషుల వలన తెలియబడవలెను (రహస్యము) యిట్టి అఖండ యెరుక తెలియబడనిచో వానిజ్ఞానము వ్యర్ధమే. యింతకు చెప్పదలచినది ఆత్మభూమానంద స్వరూపమని వుపనిషత్తునడిగిన నేతి నేతి హూవాచయమును అవిజ్ఞేయ అనిర్వచనీయ, నిరుపాది కాత్మను గురించి నేతి నేతి యనుటయంటే వేరే మనవలయును. విషయానంద మగు చక్కెర మొదలగు వాటిమాధుర్య తారతమ్యమేమా అది అనుభవైకవేద్యమే గాని చెప్పజాలమె, సర్వర సోత్పత్తికి కారణముగు ఆత్మానందమునకు నిర్వచనముశృతి; దానిని నకారాత్మయని చెప్పినది. యిట్టివి అసత్ అభావాత్మక మనుకొను నెమోయని సురల శృతిసవస్వద్ఞాయేత్ అని వివరించెను.అది అభావాత్మక మగుచో విశ్వోత్పత్తి యెట్లు

అసత్తని యెందుకనవలె నంటే, సత్తుచేనియందుండును? సత్తునందు సత్తుండదు కాన అసత్తునందేయుండును. చీకటి వెలుతురులోన అణగియున్నట్లు యీ రెండు విరుద్ధములుగా నున్నను, అవినాభావ సంబంధమున్నది. ఈ సద సత్తులను యిట్లే భావించవలెను.

13-13 శ్లో॥ జ్ఞేయం యత్తత్ప్ర వక్ష్యామి। యజ్జ్ఞాత్వా మృతమశ్నుతే
అనాదిమత్పరం బ్రహ్మన సత్తన్న సదుచ్యతే ॥గీత॥

తా॥ యేది తెలియదగిన బ్రహ్మ స్వరూపమో దేనిని తెలిసికొని మనుజుడు అమృత స్వరూపమగు మోక్షమును పొందుచున్నాడో అద్దానిని బాగుగా చెప్పబోవుచున్నాను. అది లేనట్టి పరబ్రహ్మ మనబడు అయ్యది సత్తని గాని అసత్తని గాని చెప్పబడదు. అయ్యది అచల ఋషులచే తెలియదగి యున్నది.

దీనిలోని భావమునే భాగవతుల కృష్ణదాసుగారు 125, 126, 127 కంద పద్యములో తెల్పియున్నారు. యీ గ్రంథములోనే పిండ బ్రహ్మాండ ప్రకరణములో చూడుము.

ఉదాహరణముకొరకు అచలఋషి పొన్నాల రాజయ్యగారు రచించిన నిజబ్రప్రబోధ విధానమునందలి పురుషోత్తమ రూపవార్తిక నిర్ణయములో "భూమి యొక్క అంతరమందు జలరాసులుగ నున్నను, పై భాగమున కూపతటాక, నదీ, నదంబులుగానున్నను, మేఘమునందు మేఘజలంబుగా నున్నను, మొత్తముమీద అన్ని చోట్లగలది యుదకమని యెట్లు నిర్ణయమగునో, అట్లే చూచునది చూపించునది, చేయునది, చేయించునది

వినునది, వినుపించునది, ఏకమేకాని యెన్నటికీ ననేకముకాదు. అట్టులేకమైన ఆత్మ దేని కొరకు శ్రవణమననాదులు చేయవలయును? తైలధారవలె దేనిని ధ్యానించవలయును? ఏకత్వమునందు శ్రవణాదుల నిర్ణయములేదు. ఉన్నదనినచో ద్వైతము సిద్ధించును. కాని అద్వైతసిద్ధిలేదు గదా అని యిట్లు వార్తికము నిర్ణయించుచున్నది. యిట్లు నిర్ణయింపబడిన వార్తిక సిద్ధాంతము నందుగల బ్రహ్మ, పరిణామావస్థగలిగినది. ఎట్లనగా వార్తిక నిర్ణయమగు నుత్తమపురుషుడు నిష్కామ స్వస్వరూపుడు అనగా అపేక్ష రహితచేతనుడు, అందువలన అచల పరిపూర్ణ ప్రబోధకుల నిర్ణయము వేరుగ నుండును" అని సెలవిచ్చిరి ఇట్టివి పై విషయములకు రుజువుగా శ్రీ గురుజ్ఞాన వాసిష్ఠ, జ్ఞానకాండ ప్రథమపాద, షష్ఠోధ్యాయ, శ్రీ ఋభుగీతలోని నాలుగవ అధ్యాయము 60, నుండి 65 శ్లోకములు చదువుము.

శ్లో॥ బహూనాం జన్మనామన్తే జ్ఞానవాం మా ప్రపద్యతే
వాసుదేవస్సర్వమితి సమహాత్మాసుదుర్లభః ॥గీత॥ 7అ-19శ్లో

తా॥ అనేక జన్మలు యెత్తిన పిదప వాసుదేవుని తెలియు జ్ఞానముగల మానవజన్మ లభించి, అట్టి జ్ఞానవిమర్శనవలన పరిపూర్ణ గురువుచే జనన మరణరహితమగు కుంఠితముగాని వైకుంఠము తెలియబడును.

యేమయినను యీ విశ్వమునందు ఎఱుంగదగినపరమసీమ పరాత్పరమన్నది దానినెఱింగిన యిక యెఱుకవీడును. తదుపరి ఈ గ్రంధములోని అచలప్రకరణము గురువువలన తెలిసికొని జన్మరహితము నొందుదురు.

మన తల్లిదండ్రులు మనల కని పోషించువిధముగానే సృష్టి కర్తపై భ్రాంతిచే

అనేక జన్మములు స్వీకరించి నానా యాతనలుపడి ఏ భగవత్ దర్శనము కలిగినంత నే యెఱుకలేక సేవించదగు విధానము ప్రాప్తించునో దానిని గురుముఖమున గ్రహించి సుఖ దుఃఖములబాధ, జనన మరణములబాధ తొలగియుందురని గ్రహించిరి. దీనినే పరిపూర్ణ భావము అందురు.

## 2. భాగము

## 1. భౌతిక శాస్త్రము - తత్వశాస్త్రమునకు గల సంబంధము

మనకు రాష్ట్రపతిగా నుండిన డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు హిందూ దేశమునందలి Phylosopy పాత పద్దతిలోనే నిల్చిపోయియున్నదని అన్నారు గనుక ప్రస్తుత తత్వవేత్తలు కొంత ముందంజవేసి భౌతిక శాస్త్రజ్ఞులు కనుగొన్నవస్తుప రిశోధనా శాస్త్రమును పరిశీలించి రెంటిని జోడించి క్రొత్తమలుపును సమకూర్చవలెను. పూర్వీకులు తత్వశాస్త్రమును తమకొరకే పరిమితి చేసుకొన్నారు. కానీ నేటి భౌతిక శాస్త్రజ్ఞులు ఆ విధానమునే వస్తురూపముగా కనుగొని మానవకోటికి వుపకరించునట్లు చేయుచున్నారు. ఇట్లు చేయుటలో మానవకోటి కల్యాణము కొరకు కొంత, సంహారము కొరకు కొంత, అన్వేషణ జరుగుచున్నది.

ఇక భౌతిక శాస్త్రజ్ఞుల పరిశోధనలను కొంతవరకు విచారింతము. తత్వశాస్త్ర జ్ఞులు ప్రపంచోత్పత్తి విధానములో, ఆత్మయందు ఆకాశము, ఆకాశమునందు వాయువు, వాయువునందు అగ్ని,యందు జలము జలమునందు పృథ్వి, కలిగినవనియూ అట్లే పృథ్వి జలములోనికి, జలము అగ్నిలోనికి అగ్ని వాయువులోనికి, వాయువు

ఆకాశములోనికి లయమగునని నిర్ణయించిరి. యీ నిర్ణయమును బట్టి ప్రతి భూతములో అన్ని భూతముల యొక్క, స్థూల సూక్ష్మరూపములు, వుండివుండవలెనుగదా. మొదట సృష్టి నిర్మాణములో ఆకాశము నుండి సూక్ష్మమగు ఆత్మ యందు శబ్దము వెలువడినది గదా? గనుక ఆ శబ్దము ఆత్మయందు దాగివుండి వుండవలెనుగదా? అట్లు యుండు ఆ శబ్దము వ్యాకోచముచెంది సృష్టి యందంతయు అన్ని భూతములలో నిండియున్న దనవలెనుగదా? యిందు నుండియే భౌతిక శాస్త్రజ్ఞులు పరిశోధన ప్రారంభించిరి. యిది యే మొదటిదగు సాక్షి యొక్క అంశమని తెలిసేది. నెం-1 శబ్దం—యిక భౌతిక శాస్త్రజ్ఞుల పరిశోధన వస్తురూపముగా గమనించెదము, వారు పృధ్వియందు శబ్దమును ప్రసారముచేయు పదార్ధమును కనుగొన్నారు. దినినే మన పూర్వీకులు పలుకురాయి అన్నారు. ఉదా:— చూడండి గోల్కొండలో ముఖద్వారమున శబ్దము చేసినయడల నేటికి కూడా ఆ శబ్దము కొండపై కోటలోనికి వినపడును. గనుక పూర్వీకులు అట్టి రాయిని యంత్రముగా ఎచ్చటనో బిగించియున్నారని తెలిసేది.

ఇప్పటి శాస్త్రజ్ఞులు అట్టి భూపదార్ధమును ఒక ప్రదేశములో అనగా ఒక గది లో బిగించి అచ్చటి నుండి మాట్లాడెదరు. ఆ మాట యంత్రము గుండా బయలులోనికి ప్రవేశించును. ఇచ్చట ఆత్మస్థానము నుండి బయలు వెడలిన శబ్దము భూనభోంతరాళము నిండి, మరలా భూమి నుండి బయలు వెడలుటకు అవకాశమున్నది. గదా? ఆబయలం దు (Eather) యీతర్ అను ద్రవపదార్థము ఆ మాటను నలువైపులకు ప్రసరింపజే యును. కారణమేమనగా అశబ్దము భూపదార్థము నందు ఉండునట్లుగా, జలపదార్థమునం దుకూడానుండుటబట్టి తెలిసేది. తదుపరి అగ్ని భూతము ఆ ధ్రవపదార్థములోని శబ్దము

ను నలువైపులకు విస్తరింపజేయును. తదుపరి వాయుభూతము ఆశబ్దమును తనవెంట తీసుకొని పోవును యిది అంతయు అవకాశము గల ఆకాశ భూతములో జరుగును, గనుక పై ఆత్మ నుండి వెలువడిన శబ్దము పంచభూతములలో సృష్టి యందు తిష్ట వేసుకొని యుండునని తెలియవలెను. యీ శబ్దము సృష్టి లోని ఏ ప్రదేశము నందైనను బహిర్గత మగుటకు మొదట యుపయోగించబడినటువంటి భూపదార్థము (Receiver) సహాయమున చేయబడిన యంత్రముద్వారా స్పష్టముగా వినపడును. సృష్టిలో ప్రతిశబ్దము వుండునని గ్రహించవలెను.దీనికి తార్కాణముగా Tape Record అను యంత్రమును శాస్త్రజ్ఞులు తయారుచేసి యున్నారు గదా! దానిలోనికి అట్టి శబ్దము ఆకర్షింపబడి, యిమిడియుండి. దేశ, కాల, భేదములు లేక మరలా అందలి మాటలు విన వచ్చుచున్నవి గదా! దీని వలన ఏమి తేలినదనగా బ్రహ్మాండము ఎంతో పిండాండము లోని విషయములు కూడా అంతే అని గ్రహించేది. యీ పిండాండములోచేయు శబ్దము అనగా సంస్కారములు యిందులోనే మనస్సు అను యింద్రియములో Tape Record వలె తిష్టవేసుకొని యుండును అదేవిధముగా ఆమనస్సుయున్న బ్రహ్మాండములోని శబ్దముయుండు అంతఃకరణమున్న అనగా బ్రహ్మస్థానమున్ను ఎకమే గనుక వ్యక్తి వలన ప్రసాదింపబడిన శబ్దము ఆబ్రహ్మాండములో నిండియుండును. అట్టి శబ్దమును సత్వ, రజో, తమో, గుణములు కలదిగా భాగించవచ్చును. యీ శబ్దము మూడు గుణము లుగా యుండి శబ్దమునుబట్టి, స్పర్శనుబట్టి. రూపమును బట్టి, రసమునుబట్టి, గంధము నుబట్టి, అందులోని దుష్ట, శిష్టలక్షణములబట్టి, మూడు విధములైన విత్తనములవలన జీవి మరల జన్మించునపుడు అతని భవిష్యత్తు నిర్ణయమగును. దీనినే సంస్కారముల మూటయందురు. యిట్లు మూడు గుణములలోని బీజములు మొలకెత్తునప్పుడు. వ్యక్తివలన ప్రసాదింపబడిన భ్రాంతి రూపమగు శబ్దము యొక్క లక్షణములను బట్టి మొలకెత్తు

ను. దానిని కాపాడు సృష్టికర్తయున్నంత వరకు అది నశించక వాటిని నిర్ణయింపబడు రూపములో మొలకెత్తుచుండును. యిట్టిది జీవి యొక్క పుణ్య శబ్దము, పాప శబ్దము ననుసరించి జన్మల నెత్తుచుండును. యిట్టి శక్తి బ్రహ్మాండములో నుండుట వలన శబ్దము నశించక సృష్టిలో యున్నదని శాస్త్రజ్ఞుల పరిశోధనలవలన తెలియుచున్నదిగదా-

ఇప్పటి వరకు భౌతిక శాస్త్రజ్ఞుల పరిశోధనలవలన వారు, వారికి తెలియకనే క్షరాక్షర పురుషుల శక్తిని, వస్తురూపమున బహిర్గత మొనర్చిరి. యిది పదార్థము నశించక ఒక రూపము నుండి మరియొక రూపమునకు మారుటంబట్టి మిధ్యయని తెలిసినది. యిది శాస్త్రజ్ఞులచే జెరిపిన వస్తు పరిశోధనవలన ఫలితముగదా? టెలివిజన్, టేప్‌రికార్డులు, రేడియోలు మొదలగు నుపకరణములు శబ్దమును దాచు చక్కటి యంత్రములు దీనినిబట్టి భౌతిక శాస్త్రజ్ఞులు వారికి తెలియకనే క్షరాక్షర పురుషశక్తిని (భూమియందలి పదార్థశక్తిని) అక్షర పురుషునిలోనికి (సూక్ష్మములోనికి) ప్రవేశించిన విధానమును, కనుగొని వస్తు రూపములో పెట్టిరి.

నెం. 2 స్పర్శము:— భౌతిక శాస్త్రజ్ఞులు కనుగొనిన విధానమున అక్షర పురుషుని విధానము గమనింతుము. క్షర పురుషుని యందలి సూక్ష్మశక్తి అంతయు అక్షర రూపముగా వెలువడి క్షర పురుషుని నిలబెట్టును. భూమండల మందలి జలము వేడిమికి సూక్ష్మమై ఆవిరిరూపము అనగా వాయు రూపము దాల్చి, పైకిపోయి మరలా వర్షముగా మారి భూమిపైపడి సస్యశ్యామలము చేయునని కనుగొనిరి. మరియు యీ ఆవిరిశక్తివలన యంత్రములు తిరుగు విధానము కూడా కనుగొనిరి.

తత్వశాస్త్రజ్ఞులు పై పద్ధతివలెనే తనలోయుండు వాయు పంచకము గొప్ప

శక్తిగలదగుటచే జీవులయొక్క సంస్కారములను సూక్ష్మరూపములో వెంటబెట్టుకొని మరణానంతరమున బ్రహ్మాండములోనికేగి, వర్ష బిందువుద్వారా సస్యములలోనికి ప్రవేశించి, జీవులు మరలా పుట్టునట్లుచేయుచూ యంత్రములు నడుపునట్లుగా చేయుచున్నదని కనుగొనిరి. యిచ్చట భౌతిక శాస్త్రజ్ఞుల, తత్వశాస్త్రజ్ఞుల, పరిశోధనలయొక్క శక్తి యేకమేననియు తెలిసినది. ఇది విలోమఅనులోమపద్ధతులలో నున్నది. గనుక యిచ్చట పదార్థము నశించక స్థూల సూక్ష్మరూపములలో ఒక రూపమునుండి ఇంకొక రూపమునకు మారుచున్నదనియూ, అట్లు మారుటనుబట్టి మిథ్య యనియూ, అశాశ్వతమనియు తెలిసినది. ఇట్టి క్షరాక్షరమగు మిధ్యాపదార్థమునకు అవ్యయపురుషుడు కారణుడని తెలిసినది.

కాంతి నెం. 3 భౌతికశాస్త్రజ్ఞులు సూర్యునినుండి కాంతి సూటిగా బహిర్గతమగునవి కనుగొనిరి. (Light travels in Straight lines) దానిని బట్టి వారి నిర్ణయము అనగా కాంతి బ్రహ్మాండము నందలి ప్రదేశము నుండి, కిరణములు సూటిగా వస్తువుమీద పడి వస్తువును కనిపించునట్లు చేయుచున్నదనియు ఆ కాంతి ఆ వస్తువులోనికి ప్రవేశించి అందులోనే వుండుటనుబట్టి ఆ వస్తువు కనిపించును. ఈ గ్రంథం చదివినందున మరలా ఆ కళలో సూక్ష్మరూపముగా పదార్థం పయనించి మరలా తిరోగమించునని తెలిసికొనగలరు, యిందుకు వుదాహరణముగా 16-2-80 తేది జరిగిన సంపూర్ణ సూర్యగ్రహణమునాడు అమెరికన్ శాస్త్రవేత్తలు హిందూదేశమునకువచ్చి పదార్థం అమితవేగముగా సూర్యునిలోనికి పయనించుచున్నదని కనుగొనిరి. ఇది తత్వశాస్త్రజ్ఞులవలెనే భౌతిక శాస్త్రవేత్తలు వస్తురూపముగా కనుగొన్న పరిశోధన. మరియూ యింతకుపూర్వము పత్రిక ద్వారా చదివిన విషయములో 1 ప్రొఫెసర్ చంద్ర.

2. విక్రమసింగేలు చేసిన పరిశోధనలవలన తేల్చిన విషయం ఏమనగా సూక్ష్మక్రిములు ఆకాశం నుండి వాయువుద్వారా క్రిందికి దిగుచున్నవనియు, అవి యింతకుపూర్వం సంభవించిన రెండుమార్లు తోకచుక్కలవెంట భూగోళమునకు ప్రవేశించి ఫ్లూ మొదలగు వ్యాధులు కలిగించినవనియు అప్పుడప్పుడు వాయువుగుంగా భూలోకమునకు వచ్చుచున్నవనియు మందులవల్ల నిరోధింపబడిన, మసూచి ఫ్లూ, పోలియో, ప్లేగు,కలరా ఆటలమ్మ , క్రిములు సూర్య కుటుంబములో ప్రవేశించి మరలా భూలోకమునకు వచ్చుననయు, వర్షాకాలములో జలుబు, జ్వరము, రావడమునకు కారణం వాయువులో వర్ష ముద్వారాకూడా, జలుబుక్రిములు క్రిందికి దిగిరావడమేననియు ఇంకను పరిశోధనలు జరుపుచున్నామనియు తెలియజేసియున్నారు. దీనినిబట్టి సూర్యకుటుంబములోనుండి, వేడి, నీరు, గాలి మూలమున పదార్థము క్రిందికి వచ్చుచున్నదనియు, తెలియవలెను. ఇదియే అవ్యయ పురుషశక్తి. ఈ శక్తియే క్షరాక్షర పురుషులకు కారణమనియు యిట్టి కళ, పురుషోత్తముని మహాకారణముమీద ఆధారపడి యుండున్న తలంచి భౌతి కశాస్త్రజ్ఞులు అట్టి సాక్షిని తెలిసికొనుటకు ప్రయోగములతో పయనించుచున్నారు. ఎంత ప్రయత్నములు జరిపినను పురుషోత్తముని శక్తి సహచరభావములో నుండును. గనుక మూలములేని పురుషోత్తముని ప్రయత్నమున యుగాంతమునకు చేరగలరు కాని ఇప్పుడు భౌతిక శాస్త్రజ్ఞులు అవ్యయపురుషని కారణమగు సౌరశక్తిని, అక్షర పురుషుని కళ యగు విద్యుత్‌పై ప్రయోగించుటకు ప్రయత్నించుచున్నారు దీనికి నిదర్శనముగా ఈ 12-5-80 ది పత్రికలో శక్తి యుత్పాదనకు "ఉపగ్రహ ప్రయోగం" అను హెడ్డింగ్‌లో బ్రిటన్ ఓటెల్‌శ్యాట్ యుపగ్రహానికి ఆవసరమైనశక్తిసరఫరా గురించి పరిశోధన లను బ్రిటన్ చేపట్టింది. సూర్యునినుండి వెలువడే శక్తి (సౌరశక్తిని) ఉపగ్రహ నిర్వ

హణకు ఎలా వుపయోగించుకొనవచ్చును అనేది. ఈ పరిశోధన, లక్ష్యం, సోలార్‌ఫవర్ శ్యాట్ లైట్ (సౌరశక్తి చోదిత ఉపగ్రహం) భవనాన్ని అమెరికాకు చెందిన పీటర్ గ్లాసర్ 1968లో ప్రపంచానికి పరిచయం చేశాడు అంతరిక్షంలో ఒక పెద్ద ప్లాట్‌ఫారం నిర్మించి దానిద్వారా సౌరశక్తిని విద్యుత్ శక్తిగా మార్చాలనేది ఆయన ప్రతిపాదన యిదియే. అక్షర, అవ్యయ, పురుషుల సంబంధం. యీ పనిని యిప్పుడు బిటన్ యితర దేశముల సహాయముచే నిర్వహించుచున్నది దీనిని బట్టి క్షర పురుష కళ సూక్ష్మముగా మారుటకు అవకాశము కలదనియు క్షరాక్షర పురుషుల కళ కరెంటుగా కూడా వుపకరించుచున్నదనియు యిక యీ రెంటికి కారణమైన అవ్యయవ పురుష కళ వరకు భౌతిక శాస్త్రజ్ఞులు పయనించి ప్రపంచమునకు కనివిని యెరుగని యుపయోగములు కలిగించుచున్నారు. యిట్టి కళనే యోగులు తమ యందు దర్శించుటకై అంతర్గతముగా ఎన్నో విధముల ప్రయత్నించి దర్శించగలిగిరి. అట్లు దర్శించిన ఆ అవ్యయ బ్రహ్మకళ ప్రయత్నించినప్పుడే దర్శనమగుననియు మిగతా సమయములందు ఆకళ యుండికూడా దర్శించలేరనియు, యీ దర్శనము ఓంకార ప్రవణ నాదమైన హంసవఃననే దర్శించ గలరనియు అట్టి దర్శన పరిస్థితి గల యోగులను చణకిన దగ్ధమై పోవుదురనియు నందురు.

ఆదే విధముగా భౌతిక శాస్త్రజ్ఞులుపై కనుగొనిన ప్రకాశమును నీటిలో నుండు ప్రాణవాయువు శక్తిచే బహిర్గతపరచి రెంటిని కలిపి కరెంటుగా తయారు చేసిరి అట్టి కరెంటు కేంద్రముచే వెలిగించబడి నప్పుడు తప్ప యితర సమయములందు బహిర్గతముకాదు, అట్టి కరెంటును చణకిన దగమౌదురుగదా, యిచ్చట వీరు తమ వలన యిట్టి మహత్కార్యములు జరిగినవని గర్వించవలసినది లేశమైనను లేదని తెలియవలెను యిదే

విధముగా సృష్టిలో సంభవించు ఉరుములు, మెరుములు మొదలగు వాటివలన కొన్ని యుత్పాతములు సంభవించుచున్న విగదా!కనుక యిచ్చట ఒక విషయం గమనించవలెను "శ్రీ కృష్ణ పరమాత్మ అర్జునునితో" అర్జునా నీవు భీష్మ ద్రోణాదులు మొదలగువారిని చంపవలసి వచ్చినదనియు తలంచుచున్నావు చూడుము. నా విశ్వరూపమునందు అనగా బ్రహ్మాండము నందు అవ్యయశక్తి యందు అందరు కనపడుచున్నారు. ఇచ్చట నీవు నీశక్తివలన కనివినిన విధంబుగా అస్త్ర శస్త్రములను ప్రయోగించి వారినిహత మార్చనని తలంచుట తగదుఅనెను. దీనికి తార్కాణముగా యిప్పటి శాస్త్రజ్ఞులు కనుగొను విధానమును బట్టి బ్రహ్మాండములో ఎంత శక్తియున్నదో రుజువగుచున్నది యిది విశ్వకర్త కారణమని తెలియవలెను. యిచ్చట పరిపూర్ణము ఏలాంటి మార్పులు, చేర్పులు చెందదుగాని చలా చల పదార్థములు మార్పుల నొందుచున్నవి కేవల మవ్యయ పురుషుని యొక్క కారణశక్తి యిది కార్యరూపముగా నుండక కేవలము కారణరూపంవహించి యున్నదని తెలియవలెను.

యిట్లు క్షరా క్షర, సూత్రాత్మల వలని, తత్వ, భౌతిక శాస్త్రములకు గల సంబంధము వ్రాయుటకు చాల విషయములున్నవి కాని పుస్తక విస్తరణకు భయపడి విరమించుచున్నాడను.

యీ సంబంధము వ్రాయుటకు కారణమేమనగా సృష్టిలోని పదార్థము మూలములేనిదై నందున ఒక రూపము నుండి యింకొక రూపమునకు మారుచు నిలకడలేనిదై రాకడ పోకడలుకలిగియున్నదనియు, దానికంతయు వస్తువు యొక్క నిలకడ లేకుండుటయేనని పై ప్రకరణములు తార్కాణము, యిట్లు జీవి ఎంతకాలము రాకడ పోకడలు

కలిగియుండునో అంతవరకు సుఖదుఃఖములకు తావు కలిగియున్నది. దానికి విముక్తి కలుగవలెనన్న యిట్టి లక్షణములేని పరిపూర్ణ భావమే శరణ్యము.

— జై సద్గురు —

కం. పిండబ్రహ్మాండంబులు, రెండును యీ రెంటిలోని రెండహములు యీ ఖండ
ములు నాల్గుకూడి యఖండంబగు యెరుక రూపు గనరామాతండ్రీ యిది తెల్పిన
ఘనుడే తల్లితండ్రీ ఖండాఖండములుగా గనిపించేయెరుకనేదండిదదనేటి యుద్దం
డులకల ఐనాగనరా మా తండ్రీ॥

అని కృష్ణదాసుగారు రచించిన కందార్ధమును పరిశీలించండి యీ సృష్టి, సృష్టికర్త. పిండబ్రహాండంబులుగా వెలసి అఖండయెరుకై రాకడ పోకడలకు తావై యున్నది. ప్రథమమున యీ సృష్టిని గూర్చి కొంత చర్చించెదము. తదుపరి భగవదన్వేషణకు పయనించెదము యీ సృష్టి దీనికి రుజువుగా ఆకాశము నందు 7 రంగుల ఇంద్రధనస్సు కనిపించుచున్నది. 1. బ్రహ్మము, 2. మాయ, 3. ఆకాశము, 4. వాయువు. 5 అగ్ని, 6 జలము, 7. పృధ్వి యేడు విధములైన తప్ప సృష్టియందు యితర ద్రవ్యములులేవని పెద్దల నిర్ణయము యీ విధములకు ద్రవ్యములు ఎల్లప్పుడు మార్పులు చెందుచుండును. భౌతిక పరిశోధనలకు పూర్వమే ఆత్మపరిశోధకులు జరిపిన పరిశోధనల వలన ఆత్మ, ఆకాశావరణంలో మాయాత్మలవలని నిశ్శబ్దము నందు వాయువు, వాయువునందు అగ్ని, అగ్నియందు జలము, జలమునందు పృధ్వి, పృధ్వి యందు ఓషదులు, ఓషదలయందు అన్నము అన్నమునందు చరాచర జంతు జాలము

కలిగెననియు తదుపరి ఎట్లు కలిగెనో అట్లే లయమును కనుగొనిరి. ఆవిధముగనే భౌతిక శాస్త్రవేత్తలు కూడా పై పద్ధతిని పరిశీలించుచున్నారు.

అన్ని భూతములలో ఆకాశ భూతము పెద్దది. ఆకాశమనగా "గగనం శూన్యం" అని పెద్దలన్నారు. అనగా ఏ పదార్థముగాని అందులో నుండుటకు అవకాశమిచ్చు భూతమని అర్థము. (Space)

13-33 శ్లో. యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే
సర్వత్రాఽవస్థితో దేహే తథాఽత్మా నోపలిప్యతే॥ గీత

12-33 శ్లో. యథాప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమంరవిః!
క్షేత్రం క్షేత్రీతథా కృత్స్నం ప్రకాశయతి భారత॥ గీత

తా. సర్వవ్యాప్తయగు ఆకాశము సూక్ష్మమగుటచే దేని చేతను అంటబడనట్లు సకల శరీరముల వెలయునదియయ్యు ఆ, ఆత్మ—అయా శరీరముల గుణ దోషములచే తాకబడుటలేదు. ఆత్మకు సంగము లేదని ఆకాశ దృష్టాంతమున తెల్పబడినది. (ఆకాశం గగనం శూన్యం) ఆత్మ అంతటిని ప్రకాశింపచేయునదేయైనను ప్రకాశించు పదార్థముల ధర్మము దానికి లేదు. దాని స్వప్రకాశత్వ ధర్మము అనగా అదియే అన్నిటిని ప్రకాశింపజేయుచున్నది దానిని ప్రకాశింపజేయువారు ఎవ్వరునూలేరు. అని సూర్య దృష్టాంతముచేత నిరూపింపబడు చున్నది.

ఆత్మస్వతః చలనములేనట్లు కనుపడు చున్నందున ఇందు నిండియుండు చైతన్యమును అచలమని అద్వైతులన్నారు. ఇది ఎట్లుండునదియూ పరిపూర్ణగురునకు

తప్ప హరి హర బ్రహ్మాదులకు కూడా అలవికాదనియు అచల ఋషులు నుడివినారు. అందు వలననే ఉనికిమూలము లేనిదనియు లేనెరుకయనియు అచల ఋషులు నామకరణము చేసి ఋజువు చేసినారు. అద్వైత మతస్తులు దీనినే సాక్షియనియు, ఆది అనియు, ఆధారమనియు అచలమనియూ నుడివినారు. అవూహాగానము పరిశీలింతము. ఆకాశ భూతమును పరిక్షిలించగా అందులో శబ్ధ గుణము వున్నట్లు ఋజువు చేసినారు. ఏ వస్తువునుగాని, పరిశీలన చేయుటలో దానిలోని, స్తూలము, సూక్ష్మములను పరిశీలించుటవాడుక. అనగా ఒక పదార్ధమును తీసుకొని దాని భౌతిక గుణములు, అంతర్గత గుణములు పరిశీలించువాడు కను బట్టి ఆకాశ భూతము అట్టి పరిశీలనలో అంతర్గతముగా, శబ్ధ గుణము కలదనియు భౌతికముగా శూన్యమైనదనియు తెలిసికొనిరి. యిట్టివగు దీని గుణవిశేషంబు చేత శబ్ధము అనగా చైతన్య సంకల్ప విశేషమగు మాయచే రెండవ భూతమగు వాయువు యొక్క సంపర్కమగు ప్రాణముచే సృష్టి బహిర్గతమాయెను.

77. కం. యెరుక బయలందులేమిని! యెరుకను శూన్యం బటంచు యెరిగించబడెన్
యెరుగుమిదె ఆకసం బిట్లెరిగితె యెరుకాకసములు యేకామౌగరా ఆశకమూ
బయలే కామెట్లౌరా! పరిపూర్ణమిదిగో కన్పడు శూన్యమనరాదు॥—॥

78 కం. కనుపడెడి బయలు లోపల కనుగొన లేదయ్యె యెరుక కావున శూన్యం
బనవలెసె! దీన్నే ఆకశమనవలసెను! దీన విశ్వమాయే నాయప్పా యింతకు
వేరెమాయియేదప్పా! కనుకానె యీ విశ్వమును లేనిదని లెస్స వినజెప్ప
నాయెను! కనబోకుంతనిపోని! మాయనోయప్పా యింతకు వేరెమాయా
యేదప్పా॥—॥

## శ్రీ శివరామ దీక్షిత అచల ఋషి సాంప్రదాయ చిహ్న విమర్శనా గ్రంధము

### సత్యప్రబోధ విధానము

సృష్టి నడచుటకు ఏ చైతన్య మహామాయశక్తి అవసరమో ఆశక్తియే తనదైన అవ్యయ ప్రకాశము యొక్క శక్తిచే సృష్టిని దీపింపజేసెను యిట్టి శక్తి, క్రియా,యిచ్ఛా జ్ఞాన, ఆది, పరాశక్తిలో మహాకాశము, దహరాకాశమునిరవయాకాశము,సూర్యాకాశము, భూతాకాశములలో నిండితన్మాత్ర గుణములతో భూతపంచకమునందు ప్రవేశించి అందు త్రిగుణ బీజరహస్యముచే జలమునందును, పృధ్వియందును సకల చరాచర జంతు జాలము కలిగెను యీ సృష్టి విధానమునే మేధావులు శృతి, యుక్తి, అను భవములతో బహుపొందికగా నుడివెదరు.

గ్రంధము క్లుప్తముగా నుండుటకై విమర్శలను పరిమితి యొనర్చడమైనది. గనుక యిట్టి సృష్టి యందలి చరాచర జంతుజాలము. తమ యొక్క జ్ఞాన కర్మలముడిచే ఏర్పడిన త్రిగుణబీజములస్తాయిగా జనన మరణముల నొందు చున్నవి. యిచ్చట కొంత సాంఖ్య విచారణ పరిశీలింతము ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృధ్వి భూతములు, కపిల మహామునిచే విభజింపబడి 25 భాగములు చేయబడెను. యిదియే సాంఖ్య సూత్రము యిందు మొదటిదగు, ఆకాశాంశభూతము పిండాండమందు రెండు భాగములై మొదటి అర్ధభాగమునందు. జ్ఞాన తేజస్సు ప్రబలుటకు అవకాశము ఏర్పడినది. తక్కిన అర్ధభాగమును, నాలుగు సమభాగములు చేయుగా, మొదటి భాగము వాయువుతో కలసి మనస్సు యేర్పడెను. యిందియే 24వ తత్వము చైతన్యముతో కూడిన ఆకాశ నిశ్శబ్ధ గుణముచే చలనము లేనిదిగను, వాయు గుణముచే సంకల్పిత సకల సంస్కారములను తమ యందువుంచుకొని జ్ఞాతను వేదించుటయందును ప్రముఖ పాత్రవహించుచున్నది యిందుకు ఉదా: హరణము పర్శీలించినచో గాలి తన యందు సకల దుర్వాసనలు, సువాసనలు, ధరియించియుండుటలేదా?

గీతలో 15-8 శ్లోంక చూడుము పంచీకరణి రహస్య ప్రకరణములో వ్రాయ బడియున్నది. గనుక మనస్సు అట్టి పనియే చేయుచున్నది. మరియు మిగత ఇంద్రియ సంపర్కములచే కలుగు కర్మలు, సత్వ. రజో, తమోగుణ రూపమున సూక్ష్మ బీజములనుగా యేర్పడి జనన మరణములకు బీజములైన బీజములను తన యంతఃకరణమునందుంచుకొని జీరువు ఆధారము చైతన్యమునదై యున్నది గనుక సదరు రాకపోకలకు జ్ఞానము కారణరూపము వహించియున్నది. ఇంద్రియములు కార్య రూపము వహించి యుండుటంబట్టి సదరు కార్యరూపము ఏ రీతిగా నున్నదో ఆరీతిఫలితములు ఏర్పడును. ఉదా:— సత్వగుణ సంపన్నులు అందుకు తగిన ఆవరణములో నుధ్భవించుటకు అవకాశమున్నది. ప్రేమ కార్యములలో అలవాటు పడినవారు భగవత్ ప్రేమ పూరితమైన జన్మలున్నా, లౌకిక ప్రేమలో గ్రుడ్డిగా నడుచువారు మానవేతర జన్మలో వరుసవాయిలేక పశుప్రాయముగా తమ కోరికలు నే వేర్చుకొనుటకు ఎందుకు జన్మించకూడదు? ఫలాపేక్షతో కేవలము ఇతరులకు సహాయముచేయువారు నీడనిచ్చు మరియూ ఫలముల నిచ్చు వృక్షములుగా ఎందుకు జన్మించరు? యెక్కువగా వాయుభక్షణ జేయువారు మహాయోగులుగనో, లేక ఉత్తమజాతి సర్పములై ఎందుకు జన్మించరు? భగవన్నామ స్మరణ చేయువారు, సాలోక్య, సమీప్య పదవులు ఏల పొందరు? యిట్లు జన్మలకు కారణము వారి వారి వాంఛలే

145 కం. ఏ వస్తువు చేతను తానావిర్భవమొందు దేహమను తరువరయన్! ఆవస్తువె దానికి విత్తై వెలయును దాన్నే సాక్షి! ద్రష్టాని కనుమీ. యెరుక యిదే స్పష్టమువినుమీ భావించి చూడుమీ! బట్టా బయలను భూమి-యా

## సత్యప్రబోధ విధానము

విత్తుచెట్టన్నదరయా దా విత్తునే ద్రష్టని కనుమీ–యెరుకయిదే స్పష్టము వినుమీ॥—॥

యిచ్చట ఒక విషయము గమనించవలసి యున్నది. కోడికి కాలజ్ఞానము, చీమకు దివ్యజ్ఞానము, కుక్కకు స్పర్శజ్ఞానము తాబేటికి తలంపు, పక్షికి దూర దర్శ జ్ఞానము, మొదలగువాటికి అట్టి జ్ఞానము ఎట్లు యేర్పడినది గమనించుడు, యీ జన్మ లోనే అట్టి జ్ఞానము ఏర్పడ నేరదుగదా? గనుక వాటి, పూర్వ పూర్వ జన్మల ఫలితమే నని గమనించవలెను. అట్టివి, మానవ జన్మలోనే సాధ్యమని తెలియవలెను గనుక వీటి పూర్వజన్మలు, జ్ఞానము కలవిగా ఎందుకు భావించకూడదు? కొందరు జన్మరహిత మెందుకు అని వాదించెదరు. వారికి మానవ జన్మలోనే జన్మరహితము నొందని యెడల పై జన్మల బాధలను అనుభవించక తప్పదు అని తెలియదు. యీ విషయమును గూర్చి పెద్దలు అనేక తార్కాణములు తెలిపియున్నారు. కనుక జన్మకు కారణమైన వస్తువును లేకుండా చేసుకొను వరకును జన్మలు తప్పవు. గురువువలన జనన మరణములకు కారణమైన బీజములను, నశింపజేయుటయో లేక అట్టి వృక్షమును మొదలంట నరుకుటయే విధానము. తదుపరి జనన మరణములు కలుగని స్థానమెద్ది? అను విషయమును తెలిసిన అచల ఋషులచే నిజము తెలిసికొనుటయే మార్గము.

జడవాదులు:— పంచభూతముల గుణశక్తుల సమ్మేళనములో ఏర్పడు శక్తియే సృష్టికి కారణమనియు, అట్టి శక్తి పరమరహస్యమైనదనియు, అదియే జనన మరణములకు కారణమనియు అట్టి పంచభూతాత్మకమైన స్థూలము కార్యరూపమనియు, అందులోని సూక్ష్మము కారణ రూపము వహించుచున్నదనియు తెల్పుచున్నారు.

అజడవాదులు:— అటుగాక స్వయంభవమైన సాక్షి తనంతట పుట్టి త సంకల్పముచే సృష్టిని నిర్మాణము చేయుట, తనలోనికి స్వీకరించుట, మరలా వదలుట అను కార్య కారణములుగా నున్నదనుచున్నారు.

యిక అచల ఋషులు చెప్పునదియేమనగా? సూదిమోపను కూడా సందులేక పరిపూర్ణము కలదనియు, దానిని యెరిగిన అచల ఋషులచే, వస్తురూపముగా, పరమన పదము తెలియబడ గలదనియు అందులో జనన మరణ బీజములు ధరించుచుండు మూలములేని యెరుక వుండుటకు తావులేదనియు అట్టి యెరుకయే జడా జడముల మూల మనియు దీనిని పరిశోధించినచో మూలములేనిదనియు అందువలన జనన మరణ స్వరూపమైన నీవు లేని విధానము తెలియవలెననియు దృష్టాంతములుగా ఋజువుచేసి వస్తువు చూపగలిగిన అచల ఋషుల దర్శించని జనన మరణములు బాయగలరు.

— జై స ద్గు రు —

## 3. పిండబ్రహ్మాండంబులు ఏకమేనని నిరూపణ



ప్రతి వ్యష్ఠిలోను, స్థూల సమ్మేళనమున్నది. అదే విధముగా సమిష్టిలోను స్థూల, సూక్ష్మ సమ్మేళన మున్నది ఇది ప్రస్తుతపు భౌతిక శాస్త్రము కూడా ఋజువుచే యుచున్నది ఎట్లనగా మనము మాట్లాడు మాట సూక్ష్మరూపగా యితర దేశములకు వైర్‌లెస్ ద్వారా వినబడుచున్నది. ఉదా — యిందులో పంచభూత సమ్మేళనమున్నది

దానిని ఉదాహరణముగా గై కొన్నచో పిండాండములోని శబ్దము బ్రహ్మాండంబులో నున్నదని రుజువగుచున్నది. ఇదియే భూన భోంతరాళములలో నిండియుండు ఓంకార నాదము.

పిండ బ్రహ్మాండములో కలిగియుండు వెలుగు బ్రహ్మాండములో కూడా అంతర్గతమైయున్నదని ప్రస్తుతపు కరెంటు రుజువు చేయుచున్నది. యిదియే సృష్టిలో నిండియుండు తేజస్సు పిండాండములోని ప్రాణవాయువు నీటిలోను బైటకూడా నిండియున్నదని ప్రయోగముద్వారా రుజువగుచున్నది నీరు అనగా $H_2O$ (రెండు భాగములు అమ్లవాయువు–ఒక భాగము ప్రాణవాయువు) అని శాస్త్రజ్ఞులు ప్రయోగముద్వారా తెలిసికొన్నారు అట్టివాయువు సృష్టినంతయూ ఆకర్షించుచున్నది దీనినే తత్వశాస్త్రజ్ఞులు సూత్రాత్మ అన్నారు సృష్టిలోని పదార్ధములు ప్రతి జీవకోటిలోను యిమిడియూ బహిర్గతముగాకూడా నీటిలో, గాలిలో, యిమిడియున్నదని శాస్త్రజ్ఞులు రుజువుచేసి యున్నారు. పై రుజువులవలననే మానవుడు ఉపగ్రముల ద్వారా అన్ని విషయములు తెలిసికొనగలిగినాడు.

దీనిని బట్టి స్థూల, సూక్ష్మగుణములు సమ్మేళనముగా యున్నవనియూ చైతన్య శక్తినిబట్టి సూక్ష్మగుణము,సూక్ష్మగుణమునుబట్టి స్థూలముయొక్క విలువయున్నదనియు మానవుడు శాస్త్రవిజ్ఞానము. తత్వవిజ్ఞానములచే తెలిసికొనుచున్నాడు. యిట్టి విజ్ఞానము, మన ఋషులు తత్వపరిశోధనవలన యిదివరకే కనుగొనిరి దీనిని అనుసరించే సృష్టిలో పంచాకాశములును దానిలో ఇమిడియుండు పంచశక్తులను అందులోని పంచతన్మాత్రలను, వాటి ఆకారమే యగు పంచభూతములను రుజువుజేసి యన్నింటిని

క్రోడీకరించి పిండబ్రహ్మాండంబులుగా ఋజువుజేసి అందులోని క్షరాక్షర పరమపురుషుల లక్షణములను తెలిసి రాకడ పోకడ విధానములను రుజువుచేసి యున్నారు.

పిండాడములో పంచభూతములను పంచీకరణ సూత్రప్రకారము 25 భాగములుగా భాగించగా 25వ భాగము జ్ఞాత లేక జ్ఞాన మనబడుచున్నది దీనిని గూర్చి కొంత విచారించితము పిండాండములోని ఆకాశము అర్ధభాగము తన నిజాంశములో నుండుటచేత జ్ఞాత యయ్యెను, తక్కిన అర్ధ నాలుగుభాగములు, వాయువు, అగ్ని, జలము, పృధ్వితోకూడి మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము లాయెను యిందులో గమనించవలసిన విషయం యేమనగా!

"ఆకాశం గగనం శూన్యం" అని శృతిలోయున్నది దీనిని భౌతిక శాస్త్రజ్ఞులు కూడా సమర్ధించుచున్నారు. దానిని ప్రధమముగా తీసుకొని యిది ప్రత్యగాత్మకు ఆవరణముగా గైకొని అందులో ఆకాశస్యగుణ శబ్దో అను శృతిని ద్వితీయముగా గైకొని వాయువు, అగ్ని, జలము, పృధ్విలోని గుణశక్తులు కలసి త్రిగుణాత్మకముగా శూన్యభాగమునుకూడా ఆక్రమించి జ్ఞాన మనసాయెను.

ఇచ్చట చైతన్యములేనిదే జడము ఏమి చేయజాలదు. "ఏకం అనేకం భవతి" అని తెలిసేది. అట్టి జ్ఞాత, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకార రూపములై సమాన వ్యాన, వుదాన, ప్రాణ, అపానములతోకూడి, శ్రోత్ర, త్వక్కు, చక్షు, జిహ్వ, ఘ్రాణముల ద్వారా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల నెరిగి వాక్కు, పాణి పాద గుదములచేత వచన, దాన, గమన ఆనంద విసర్జనములు చేయును. యిట్టి జ్ఞానకర్మల ముడివలన

ఏర్పడిన కర్మ సంస్కారములు, సత్వ, రజ, తమో గుణములగు విత్తనములై రాకడ పోకడ కలదియగు పదార్థము తనదైన అంతఃకరణములో నుంచుకొని, జ్ఞాత, వ్యష్టి, సమిష్టుల యందు నిండియున్నది ఇదియే శ్రీకృష్ణపరమాత్మచే అర్జునునకు తెలియజేయ బడీన తన నిజస్వరూపము.

ఇది తత్వములలో యేర్పడిన, సత్వ రజో, తమోగుణ. బీజరూపములగు పదార్థమునకు ఆధారమగు జ్ఞానరూపముగా నున్నది. అట్టి జ్ఞానమును ఆధారముగా గైకొని రాకడ పోకడలు కలుగుచున్నవి. యిందు ముఖ్యముగా రెండు విషయములు గమనించవలెను జ్ఞానము శూన్యస్థానము వహించినందున జ్ఞానమును పరిపూర్ణములో శూన్యమన వలెనుగాని పరిపూర్ణమును శూన్యమనరాదు, దానిని గురుకృపవలన తెలిసికొనవలెను. పై సందర్భమును రుజువుపరచుటకుగా కృష్ణదాసుగారుచెప్పిన కందార్థములలో

64కం. యెనుకైన భూతముల! నీవెరుగుము ఆకసము గాడ్పుయింగలమును నీళ్ళరవం
డనేలయనినే! నెరిగిన పద్ధతిని నీకు! నెరిగించినానూ! ముజ్జగములయ్యెను వీట
తోనూ! పరిపూర్ణమందు కన్పడుచు తమకు తామే మరి కానరావిట్టి మార్గము
కలవీటి నెరిగించినానూ, ముజ్జగములయ్యెను వీట్లతోనూ॥

154 కం పొరలరటి దుంపయనినను-తరువులు వనమనిన రవలు, దారుణియనినన్-గిరి
యనిన రాళ్ళు బట్టలు ధరముళ్ళ యనిన, తత్వతతి యెరుకంచనినా లేనిదె యె
రుక-స్థితిలెస్సకనినా! యెరుకాజేసిన-విశ్వమెరుకవంటివే, బయలు నెరుకాగు రై
రిగితానే గితెసరి తత్వతతియెరుకంచనినా, లేనిదె యెరుక-స్థితిలెస్సకనినా॥-॥

## శ్రీ శివరామ దీక్షిత అచల ఋషి సాంప్రదాయ చిహ్న విమర్శనా గ్రంధము

### సత్యప్రబోధ విధానము

అనియెన్నొ దాఖలాలున్నవి గనుక తత్వములలో యెరుకవలనక ర్మసంస్కారములు యేర్పడినవి.అట్టి త్రిగుణములే తత్వములవలన సూక్ష్మ పదార్ధమని తెలియును గనుకత్రి గుణములలో సత్వగుణమువలన జ్ఞానముకలిగినది జ్ఞానములోనుండు రజో గుణములవలన సృష్టికలిగినది తమోగణమువలన అజ్ఞానముకలిగినది జ్ఞానమనగా నేను ఆత్మ,అన నొక్క టే,మరలా ఆత్మే సృష్టికి ఆధారమైనది గనుక గుఢమధుటపత్ చైతన్యం దేహంలోనున్నది

85కం మేనెరుకల రెండింటిలో దానిని యిది, దీని నదియుతగ స్మజియించుక-మేన్నెరుక లివియు మూలములేనిదే సృజినయ్యెననుచు! లేనేలేవంటీ! అంటెతప్పు లేనేలేదం టీ!మేనెరుకలిప్పుడూ-దేనందున్నవో చూచి-లేని మేనెరుకాల లేనివనుచు నమ్మ లేనేలేవంటీ! అంటె తప్పులేనేలేదంటీ॥

116కం తను వెరుకలు రెండొక్కటి-యని, యనరాదనుచు కొందరందురు భువిలో తను వెరుకలలో నొక్కటి గన రాకుంటేను రెండు గనరావోయన్నా-రెండు క్కటె వినరామాయన్నా అనుమాన మికయల అందారి మాటలు వినబోక నేబో ధించినరీతి నెప్పుడు-గనరా వోయన్నా రెండొక్కటె వినరామాయన్నా॥

125కం జ్ఞానంబు సత్వగుణమను దానికి జన్మించెననుచు! దామోదరుడా! మేనత్త కొడుకుతోననే జ్ఞానమునకు జన్మమొకటి గలిగెగదోయీ॥

126కం పుట్టింది, గిట్టు జ్ఞానము! పుట్టెననుచు కృష్ణమూర్తి, పురుహూతజుడా! నట్టి తన ముద్దుమరిదికి! గట్టిగ విజెప్పెనిందు కలతేమోయీ॥

## శ్రీ శివరామ దీక్షిత అచల ఋషి సాంప్రదాయ విహ్న విమర్శనా గ్రంథము

## సత్యప్రబోధ విధానము

127 కం॰ జ్ఞానమగు నీవు, జ్ఞేయంబైన బయలుగాంచి జ్ఞానమగు నిను, నీవే, లేనంచు
తెలియుమనితా నా నరునకు వాసుదేవుడా నతియిచ్చె॥

ఈ గ్రంథములోనే భాగవతమున ఏకాదశ స్కంధమును తార్కాణముగా గైకొని వ్రాసిన సందర్భములోని జ్ఞానము పరిశీలించుడు.

పై అంశమును జ్ఞానముగను రెండవ అంశమును అంతఃకరణముగను గైకొనవలెను. గైకొనుటలో పై అంశము జ్ఞానము అందులోవి సంకల్పించుకొనునది మనస్సు కర్మగా నడుచుకొనును, ఇట్లు నడుచుకొనునది మనస్సులో తన సంకల్ప క్రియచే ఏర్పడు కర్మ సంస్కారములు నుండుటకు అవకాశమున్నది. ఏలాగననగా మన ప్రతి బింబము ఎట్లు అద్ధములో నుండునో అట్లు అని భావించవలెను. ఈ అవకాశమును పురస్కరించుకొని ఇచ్చట అద్దము అంతఃకరణముగను, సంస్కారములు ప్రతిబింబమని భావించవలెను.

కం. ముడిబడి కర్మము జ్ఞానము విడువక నా రెండు వెలసె విశ్వమనదే కడువేక్క
బయలుగనినా ఘడియైనను నిల్వలేక కత్తెపోవున్

అని కృష్ణదాసుగారు చెప్పినట్లు తెలియవలెను. యిందులో గురువువలన జ్ఞాన కర్మలముడి విప్పబడవలయును. ఈ ముడివిప్పు విధానము ఈ గ్రంథమును వ్రాసినవారి గురువులైన వేంకటేశావధూత స్వాములవారు, పీల్యాన లక్ష్మణ ప్రభువుగారు, భాగవతుల కృష్ణదాసుగారు, శ్రీ శివరామదీక్షితులవారివద్ద నుండెను. ఇంకనూ అట్టి మహనీయులవద్ద నుండెను. ఒక వ్యక్తి తన రూపమును అద్దములో చూచినప్పుడు ఆతని

ఆకార ప్రతిమ, అద్దములో ప్రతిబింబముగా నున్నదికదా! అట్టి ప్రతిబింబమునకును, వ్యక్తిబింబమునకు వేరులేని విధానముగా ప్రతి వ్యష్టిలోని జ్ఞానబింబమునకును సమిష్టిలోని విజ్ఞాన ప్రతిబింబమునకును వేరు లేదని భావించవలెను. ఇట్లు సమిష్టిలోని రహస్యమున్నదని తెలియవలెను ఉదా — ఎట్లనగా ప్రతి వ్యక్తి బాల్యదశలో జ్ఞానము ఏమిలేనట్లుగా తెలియబడుచున్నదిగదా! అదే వ్యష్టి దిన దినాభివృద్ధి నొందుచుండగా విజ్ఞానముకూడా వృద్ధినొందుచున్నది. ఆ జ్ఞానము యెచ్చ్చదేనున్నదని ప్రశ్నించుకొనగా మనకు కలలో కనుపడు రూపము లెచ్చటివి అను దానికి జవాబు? మెలకవలోనిదే వారు రూపములలో స్పష్టమగుచున్నవని తేలుచున్నవి అదే విధముగా పైవ్యక్తిలోని విజ్ఞానాభివృద్ధి పూర్వము ఆ వ్యష్టియందు పూర్వము తాను దాచుకొనుయుండు తన విజ్ఞానమును స్వీకరించు కొనుచున్నదని, భావించవలసియున్నది, అట్లు తాను స్వీకరించుకొను విజ్ఞానము యితరుల సహాయముచేతను ఇంకనూ తనకుండు ప్రజ్ఞాన విశేషముచేతను ప్రజ్వరిల్లి అతను గొప్ప వ్యక్తిగాను మేధావిగను యేర్పడుచున్నాడు.

పై విషయములను లోతుగా విచారించగా సాంఖ్య సూత్రములలోని 25వ భాగమగు జ్ఞానమును తత్వశాస్త్రజ్ఞులు తెలిపినట్లుగా పంచభూతములను వాటి వాటి స్థానమునందు పంచ తన్మాత్రలు పంచశక్తులలోని చైతన్యమువలస కలిగిన సృష్టి రహస్య నిర్మాణమును తెలిపిరి, సృష్టి ఏ విధానముగా నున్నదనగా ఆత్మ యందు ఆకాశము, ఆకాశములో వాయువు, వాయువు నందు అగ్ని, అగ్ని యందు జలము, జలము నందు పృధ్వి, పృధ్వియందు ఓషధులు, ఓషధులనుండి వృక్షులు, కలిగినవని యు అదే విధముగ, వృక్షులు తమ జీవితములో ఆర్జించియుండు సత్వ, రజో తమోగుణములతోకూడిన బీజములను గైకొని పృధ్వి నుండి జలమునకు జలమునుండి అగ్ని

లోనికి, అగ్నినుండి వాయువులోనికి, వాయువునుండి స్వస్థానమైన జ్ఞానములోనికి లయమై మరలా వుత్పత్తికి వచ్చుచున్నది.

ఇట్లు సృష్టిచక్రము (evolution and involutoin) విలోమ అనులోమ క్రమములో తిరుగుచున్నది దీనికి వుదాహరణగా చూపిన ప్రతి భూతముకూడా తిరుగుచున్నది యెట్లనగా నీరు సూర్యరశ్మికి ఆవిరియై పైకి ఎగిసిపోవుచున్నది మరలా పైనుండి వల్లబడి స్వస్థానమునకు చేరుచున్నది ఇట్లే ప్రతి భూతము యొక్క సంచారమునున్నదని గ్రహించవలెను బృహద్వాశిష్ఠమునందు 94 పేజీలో నిదాఖలా గమనింపుడు చైతన్యం దేహంవలన పుట్టింది అనరాదు గుడమధురవత్, పెరుగు కవ్వంచేత తరిస్తే వెన్నపుట్టింది అని అందరికి యెరుకే దేహంలో వున్నది గుర్తెరిగే జ్ఞానం దేహంవలన పుట్టింది. త్రిగుణాత్మకం, దేహాదిపదార్థాలను గుర్తెరిగే జ్ఞానం, సత్వగుణం వలనపుట్టుతుంది. యిప్పుడు నాకే అయోని సంభవాలు, కలలో అనేక శరీరాలుతోచినవి. గుర్తెరిగే జ్ఞానంతోకూడాతోచినదివెంటనే తెలియగనే యేమీలేదు. మనఆశచేత శరీరాన్ని కొంత కట్టివేసుకొంటే వుండదలిచినదేమికాదు, అశయితే జ్ఞానం దొడ్డది అని ప్రసిద్ధి యెందుకున్నదిలోకంలో పాపాత్ముడు ధర్మంచేస్తే మహాదొడ్డవాడు అను ప్రసిద్ధివిధములే.

## 1. అచల ఋషి సంప్రదాయ చిహ్నమునుగూర్చి:-

ప్రతి సంప్రదాయములోని రహస్యమును తెలియజేయుగుర్తును. ఆ సంప్రదాయ చిహ్నము (Emblom) అనెదరు. ఇప్పుడు అచల ఋషి సంప్రదాయమును తెలియజేయు చిహ్నమును ఈ ప్రకరణములో తెలియజేయబడుచున్నది. ఈ సంప్రదాయకులలో ఒక ప్రముఖులగు శ్రీదాసానంద ఈపూరు శేషపాణిగారికి అట్టి చిహ్నము ఏ

## శ్రీ శివరామ దీక్షిత అచల ఋషి సాంప్రదాయ చిహ్న విమర్శనా గ్రంథము

## సత్యప్రబోధ విధానము

మహనీయునిచే గీయుబడినదో ఆయన పేరు అందులో లభించబడకపున్న చిహ్నము ఏదో ఒక సభలో దొరికినది. అట్టి చిహ్నమును శ్రీ శేషపాణిగారు శుద్ధనిర్గుణతత్వకందార్థపుస్త కములో గుర్తు చేసియున్నారు. అట్టి చిహ్నమునుగూర్చి వివరము తెలియజేయుమని ఆయన నన్ను కోరినందున నా గురుబోధకులోనై నాకు ఏర్పడిన విధానముగా యీ గ్రంథము ను వ్రాసినాను ఈ గ్రంథములో చిహ్నమును గూర్చి ప్రత్యేకముగా యీ ప్రకరణము ను లభించి పాఠకుల ఎదుట నుంచినాను గనుక చదివి ఆ చిహ్నమునుగూర్చి నా గురువుగారి కృపచే నాకు ఏర్పడిన విషయమును గ్రహించగలరని మనవి.

2, భక్తులారా! ఇది సప్తావరణయుక్తంబై వాచాతీతమై ప్రత్యక్ష ప్రమాణము గా శ్రీ మించునచలబోధను సూచించు ప్రత్యేక్షప్రమాణ చిహ్నము టి. వి. లో శ్రీ సత్య సాయిబాబాగారు అదిగో అల్లదిగో శ్రీవాసము అని తన ఆత్మసాక్షాత్కార భావము శిష్యు లకు బోధించు శ్రీకార వాక్యమును గమనించుడు ఇదియే ఆత్మసాక్షాత్కార ప్రమాణవాక్యం నిశ్శబ్దమును నిరాకారమును సూచించుచున్నది.

రెండవదగు మాయాబ్రహ్మవాక్యము ఇది త్రిగుణములతో నిండి యున్నది. ఇది అ, ఉ, మలతో కూడి యుండిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల మనోరూపమగు ఓం కార వాక్యము.

ఇక మూడవదగు బీజరూపములగు ఐదు తన్మాత్రల సూచించు గీతలు. జీవి పుట్టుటకు కార్యరూపములగు బీజములు ఈ సందర్భమున నాకుస్ఫురించు బృహదారణ్యో పనిషత్తు నందలి శ్లో = పూర్ణమదః పూర్ణమిదం అని వాక్యములున్నవి అనగా పరిపూర్ణ పరబ్రహ్మము పూర్ణముననే యున్నది దీనిని సూచించు అనిర్వచనీయమైన జ్ఞానబ్రహ్మ

వాక్యము కూడాపూర్ణముగనేయున్నది ఇట్టిదగు రెండవ పూర్ణమే ఈ చిహ్నమునందు పొందుపరచయిబడియున్నది. ఈ చిహ్నమును గూర్చి అచల భావస్థులు విచారింపవల గును ఏమనగా ఈ సప్తావరణయుక్తంబైన పూర్ణభావచిహ్నము నందు రెండు వివర్త ములు కాననగును అనియే కారణకార్యరూపమగు సృష్టి నిర్మాణ రహస్యపుగుముడి.

ఈ ముడి యందు జ్ఞానబ్రహ్మ నిరాకారములో నిశ్శబ్దుడై శ్రీకార వాక్యమునకు అనగా నిశ్శబ్దమునకు కారణుడైయున్నాడు ఆయన యొక్క యీ త్రిగు ణాత్మకమైన ఓంకార రూపముతో సృష్టి నిర్మాణము కాననగుచున్నది. ఇట్టి తరితన్మాత్ర ల కార్యరూపములగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ గుణములలోని చర్యలు బీజ రూపమువహించి వేరువేరుకగా రూపముదాల్చుచున్నవి. ఇట్టివి గురుమూర్తిచే తెలియవ లెను, ఈ విధానమునంతయూ యీ గ్రంథము నందు ప్రారంభమున జ్ఞానబ్రహ్మను గూర్చి నిశ్శబ్దముగా తెలియబడుచున్నది. తదుపరి మాయ తన విధానములో ఐదు తన్మాత్రలచే సృష్టి నిర్మాణ బీజములదాల్చి సృష్టిని నిర్మించుచున్నది.

అది ఎట్లునగా ఆకాశావరణములో శబ్దము కలిగి ఆకాశస్యగుణశ్శబ్దో నిశ్శ బ్దో బ్రహ్మముభృతే అను రీతిలో తన్మాత్ర గుణవిశేషముచే వరుసగా సృష్టి నిర్మాణము నకు అనువగు లం, వం, దం, అం, యం అను బీజములు వాటి శక్తుల సహాయముచే రూపముదాల్చి ఆయాదేవతా భ్రాంతిచే విశ్వము ఏర్పడుటకు కారణమగుచున్నవి. ఇట్టివి గురుకరుణచే విచారింపబడినవాడే గురువు గురువనగా శబ్దనిశ్శబ్దములగు తన్మాత్రలు లేని పరిపూర్ణ పరబాహ్యము నవలోకించి పరిపూర్ణుడై సహజామనస్కుడైనవాడు,

దీనిని గూర్చి శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారు తన అనుభ

వములో తారకభావముచే జన్మము తొలుగదు అని తెలియజేసి యున్నారు జన్మకు కారణమగు బీజరహితము నందే జన్మము తొలుగునని అచల సంప్రదాయము తెలుపుచున్నది. ఇట్టిదగు ఈ చిహ్నమును గూర్చి తెలుపుటకై యీ గ్రంథము రచింపబడినది. ఇట్టిధగు ఈ చిహ్నము యొక్క రహస్యము నవలోకించినంతనే జన్మము తొలగుటకు అవకాశమున్నది.

పై బీజరహిత విధానములో అచల ఋషుల నిర్ణయమేమనగా శబ్దతన్మాత్ర బీజములు స్పర్శతన్మాత్ర బీజములు రూప తన్మాత్ర బీజములు రస తన్మాత్ర బీజములు గంథ తన్మాత్ర బీజములలో మాయమై బీజరహితమువహించు విధానములో గంథగుణము భూగుణము కఠినమైనందున అది జలబీజములోలయమగుటను సూచించుటకు గుర్తుగా కఠినగుణములుగల శంఖము పూరించబడుచున్నది. అనగా శంఖగుణము పరిశీలించుట. ఇట్టి తది శ్రీ కృష్ణ పరమాత్మఅర్జునునికి సంభవించిన విషాద రహితమునందు శంఖము పూరించి అర్జునునికి కలిగిన భ్రాంతి రహిత విధానములో అర్జునునికి భ్రాంతిరహితమొనర్చిన విధానము శ్రీ శేషపాణిగారు కరపత్రముద్వారా నిరూపించియురు.

అచల గురువులదది గ్రహించి మన చిహ్నమును శంఖముగను ఇట్టి సంస్కారాణువులు విశ్వమునందు తిరుగాడుననుటను నిరూపించుటలో చక్రముగను పాటించి శంకచక్రచిహ్న దారులుగానిరూపించుచున్నారేకాని పొరపాటుగా లేనెఱుకను యెరుకలేదు యెరుకలేదు అనిచెప్పువిధానముకాదు లేనెరుకను యెరుకలేదు అనరాదు ఎందుకనగా పై చిహ్నమునందుయెరుక నిశ్శబ్దస్వరూపము వహించినదిగదా గనుక యెరుక వున్నదని

చెప్పుటకు వీలులేదు. పరిపూర్ణ పరబ్రాహ్మ్యమున యెరుక వర్జనీయము. గనుక లేనెరుకను యెరుకలేదని చెప్పుట హాస్యాస్పదమని తెలియవలెను. గనుక పరిపూర్ణ పరబ్రాహ్మ్యము నందు రెండు పదములు వర్జనీయములే గనుక యెరుకలేదు యెరుకలేదు అనివావా చెప్పు వారికి జన్మతొలుగదు పైగా అజ్ఞానజన్మలు కలుగును అందువలననే శ్రీ శివరామ దీక్షితులు యెరుకయున్నాదన్నా పాపమే యెరుకలేదన్నా పాపమే అని సెలవిచ్చినారు గ్రహించి విమర్శగమనించుము.

ఆంగ్లంలో ఇలా Negatiues make one positiue అని వున్నది. ఇచ్చట యెరుకలేదు అనుట ఒక Negatiue అనగా లేదు. తదుపరి యెరుక నిశ్శబ్ద గుణము కలది గనుక లేనిది శ్రీకారము వహించలేకపోవుచున్నది అనుట రెండవ లేని Negatiue వాక్యము గనుక ఇచ్చట యెరుక యొక్క రెండు Negatiue వాక్యములు లేనివై యెరుకే పరిపూర్ణమెరిగించునను వాక్యమిచట సార్థక రూపము దాల్చుచున్నది.

పరిపూర్ణ పరబ్రాహ్మ్యము అను పేర Positiue అగుచున్నది. అనగా లేని శబ్దము ఇందు వర్జనీయమై యెల్లెడల పరిపూర్ణమున్నది పరిపూర్ణముశాశ్వితము.గాను ఇది Two The Negatiues అందులేదు. ఇదే పరిపూర్ణ అచలఋషి విద్యము.

సమయము 1998 మార్చి ఆదివారము ఉగాది క్రొత్త సంవత్సర సమయమున శ్రీ సాయిబాబాగారు టి. వి. లో భక్తులను సంభోదించి అదిగో శ్రీకారము అల్లదిగో శ్రీకారము అని ఆత్మసాక్షాత్కార వాక్యము భక్తులకు తెలియజేసినారు ఇదిపై యుపనిషత్తు నందలి రెండవ పూర్ణమిదం తత్వశౌతికశాస్త్ర సారూప్యత విశ్వధర్మనిరూపణ సత్యప్రబోధనాచార్యులు అచలఋషిసంప్రదాయమును గూర్చియిలా తెలియజేయుచున్నారు

## శ్రీ శివరామ దీక్షిత అచల ఋషి సాంప్రదాయ చిహ్న విమర్శనా గ్రంథము

## సత్యప్రబోధ విధానము

ఈ చిహ్నము పరిపూర్ణపరబ్రహ్మమును తెలియజేయుచున్నది. ఇందలి ఆత్మ సాక్షాత్కార పరిణామము నిశ్శబ్దమును పురస్కరించుకొని అనిర్వచనీయమైన జ్ఞానబ్రహ్మను మొదట ఆవరణములో శ్రీకారముగా నిరూపంచుచు రెండవ ఆవరణములో త్రిగుణాత్మకముగా ఓంకారముతో కూడుకొన్న మనోరూప మాయాబ్రహ్మను ఓంకారముగా నిరూపించుచూ మూడు, నాలుగు, ఐదు, ఆరు, ఏడు, ఆవరణములను జన్మలకు కార్య రూపము వహించు బీజములను తెలియజేయుచు జన్మలు కలుగుటకు వీటి కార్యరూపమును తెలియజేయు గుర్తుల నిరూపించిరి ఇది అచల పరిపూర్ణమందు జనన మరణము, తెలియజేయు చిహ్నముగా నిరూపించి పాఠకులకు అందించినారు.

ఇది ఈ గ్రంథము నందు విపులముగా మీరు గ్రహించి జనన మరణ రహిత విధానములో పయనించగలరు. జన్మరహితమునకు ఈ మార్గము తప్పవేరే మార్గము లేదు. ఏ ఇతర త్రోవత్రొక్కిన సాలోక్య, సామీప్య సారూప్య ములు కలుగునేకాని జన్మరహితము కలుగదు.

పవిత్రమైన అచల సంప్రదాయమునందు లేనెరుక యను దానికి అర్థం తెలయక లేనెరుకలేదు అనిఅజ్ఞానముతో సంప్రదాయముకించపరుచు చున్నారు అర్థనకోరి, ప్రతిష్టకో వాడుకొని సంప్రదాయమును కించపరుచుచువీరు. సంప్రదాయ చిహ్నము నకు శత్రువులగుచున్నారు సర్వం సద్గురు చరణారవిందార్పణమస్తు

గమనిక :- ఈ చిహ్నమును పురస్కరించుకొని "ఓం" కారము పూరించుచుండిన జన్మతొలగదు ఈ ఓంకారమునందలి త్రిగుణాత్మిక బ్రహ్మను త్రిగుణ రహితునిగా భావించి ప్రార్థించిన సంస్కారాణపుల తొలగించుకొనవచ్చును,కనుక ఆయనను

సద్గురు, సద్గురు అని ధ్యానించిన ఆయన దయామయుడు గనుక యత్ భావంతత్ భవతి అను శృతి మేరకు ఆయన గురురూపమున నిన్నురక్షించ గలడు కానీ ఓంకారమునకు వలవల సున్నతగిలంచుట వరనీయ ము అని గ్రహించవలెను ఓంకారమునకు మారుగా సద్గురు అని పలుకవలెను సర్వం సద్గురు చరణారవిందార్పణమస్తు

Note : పంచీకరణి సూత్రమునుబట్టి తత్వములను అమిత సూక్ష్మముగా విపులీకరించడమైనది చూడండి భౌతిక శాస్త్రజ్ఞులు కాని వస్తుశాస్త్రజ్ఞులుకాని పదార్థము ను యెంత సున్నితముగా అణువణువునకు పరిశోధనచేసి దాని వుపయోగ ముము నిర్ధారణ చేయుచున్నారో అట్లే అని భావించవలెను.

# 4. పంచీకరణి రహస్యము

****

ఇక పంచీకరణిలోని 24 వ తత్వమగు మనస్సును గూర్చి విచారింతము. యిందు 1/8 వంతు ఆకాశ అంశము, తక్కిన భాగము వాయువు అంశము వైయున్నది. అందువలన ఇందులో నిశ్చలతకు, చలనమునకు కూడా తావుయున్నది. చలనయుతమై యితర తత్వములతోకూడి సంచరించి అందలి కర్మసంస్కారములను తనలోనికి స్వీకరించుట ఆకారమనసై యున్నది. స్వీకరించినవాటిని బీజరూపములుగా మార్చి తన నిశ్చలతలోదాచి జ్ఞానమునకు నివేదించుట ప్రజ్ఞానమనసై యున్నది. నివేదించిన తదుపరి నిరింద్రియ మనసై ఆత్మయందు అంతఃకరణ రూపముదాల్చుట దీనిపనియై యున్నది. దీనిపనిలో స్థూల సూక్ష్మ విధానము నిమిడియున్నది దీనిపని యెక్కువగా

కర్మరూపమున నున్నందున దీనికి కర్మకాండ యని పేరుపెట్టబడినది ఇవి ముడిపడియున్నవని తెలిపియున్నారు ఈ ముడి సద్గురువులవలన విడదీయబడవలెను. యిచ్చట యితర మతస్థులు భావమునకు పరిపూర్ణ భావమునకుగల తేడా గమనించుచు మతస్థులు మనస్సును అందు యేర్పడియుండు కర్మ సంస్కారములతోటి జ్ఞాత లీనము చేయుదురు. ఇట్టి లీనతలో జ్ఞానాగ్నిచేతవారి కర్మ సంస్కారములు తొలగి వారికి దైవ పదవి కలుగనని వారి నమ్మకము. అందువలన వారు మనోలీనమును వాచింతురు. అట్లుగాక వారి కట్టిభక్తివలన, సాలోక్య, సామీప్య పదవులు కలిగి తదుపరి సంచిత సంస్కారములు అనుభవించుట కొరకు జన్మలనే ఎత్తి తీరవలయును. అందువలన అచల ఋషులు దానికి అంగీకరించరు. ఏలననగా మనస్సువలన జరుపు పనులకు కర్తపజ్ఞానమని తెలియవలెను. కనుక జ్ఞానము. నేను, ఒక్కటే గనుక అట్టి మూలము లేనిదానిలో సంస్కారములతో కూడియుండు మనస్సును లేని విధానముగా లీనముచేయకపోవుటే నిధానముగా గమనించవలెను. మనస్సు లీనముకాని విధానము ఎట్లు అనునది అచల ఋషులకు తెలియును. ఈ మనోతత్త్వము ప్రతి జీవిలోను వ్యష్టి రూపమునను బ్రహాండములో సమిష్టి రూపమును ఒకే తత్త్వమునన్నది అందువలనే ఒకని మనస్సులోని విషయములను యింకొకరు చెప్పగలిగియున్నారు దీనినే మనోశాస్త్రమంటారు. దీనినిగూర్చి వివేకానందస్వామివారు యిలా నుడివియున్నారు యేమనగా ఒకతరుణములో వివేకనంద స్వామివారు వారి స్నేహితులు పోవుచుండగా ఒక జ్యోతిష్కుడు జ్యోతిష్యము చెప్పుచుండెనట. ఆయన వివేకనందస్వామి వద్దకువచ్చి వివేకనందుని మనస్సులో ఒక విషయము తలంచుకొని దానినికాగితములో వ్రాసిపుంచమన్నాడట. అదేవిధముగా స్వామివారి వెంటనుండు స్నేహితులను కూడా చేయమన్నాడట తరువాత కొంత సేపటికి ఆ జ్యోతిష్కుడువచ్చి వారు తలంచిన విషయములను చెప్పి వారువ్రాసికొనిన కాగితములను

చూడమనెనట. ఆ కాగితములలో జ్యోతిష్కుడు చెప్పిన వాక్యములున్నవి, అప్పుడు స్వామి వారు ఆ చర్యను ఈ విధముగా వ్యాఖ్యానించిరి. నీ మనోతత్వం, నా మనో తత్వం సృష్టిలోని ప్రతివారి మనోతత్వం ఒకటే ననియు, ఆ తత్వశక్తిగలవారు ఎవరి మనస్సులో ఏమియున్నదో చెప్పగలరనియు, యిటువంటి మహనీయులు హిందూదేశమున యెందరో కలరనియు నుడివియున్నారు. ఉదా :- శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారు, కావున భాగవతమునందు నాభియందు సృష్టినినిర్మించు బ్రహ్మస్థానముపైచెప్పబడిన అంతఃకరణమేననియు, అందువలన ఆ బ్రహ్మకు ప్రతి జీవి చరిత్ర తెలిసియుండితద్విధంబుగా సృష్టిని నిర్మించుననియు తెలియవలెను. సామాన్యవాడుకమాట కూడా "కర్మను బట్టే బ్రహ్మ లిఖితం" పుట్టుంది అంటారు. గనుక యిట్టి మనస్సు చరిత్రనుతెలిసినవారగుటచే అచల ఋషులు మనోలయమును సమర్థించురు. వారి విధానము వేరుగా నుండును, ఆ విధానమును తెలియుటకు అచల ఋషులే కావలయును వారే అశరీరులనబడుదురు. మనస్సునకు అధిపతి చంద్రుడు యిది పంచీకరణి సూత్రములో రెండవ స్థానము వహించియున్నది. ఈ మనోతత్వమే ప్రతి మతస్థుని, బ్రహ్మవేత్తలను వేదించునదై నందున వారు ఈ మనోగుణమును తట్టుకొనలేక దీనిని జయించవలెనందురు. లేక దీనికన్నా పైస్థానమగు జ్ఞానములో లీనముచేసిన మనస్సు లేకపోవునందురు. యిది పొరపాటని అచల ఋషులు గమనించినారు మనస్సు అనగానేమో వారు తెలిసికొన్నారు. యిందులోని జన్మజన్మాంతరముల లోని సంస్కారములు కొండలుగా పెరిగి సంచిత రూపమై యున్నదిగదా! అది ఎట్లు నశించును. అనునదే ప్రశ్న. ఈ ప్రశ్నకు అద్వైతులు చెప్పునదియేమనగా జ్ఞానాగ్నిచేత కర్మలు దహించబడును అందురు, గమనించుడు. అగ్నిచేత ఏ వస్తువుగాని దహించబడిన యెడల ఆ

వస్తురూపము మారి పవిత్రమగునేగాని నశించదనితెలియవలెను. విజ్ఞానశాస్త్రజ్ఞులు యేమ న్నారనగా పదార్థము నశించదన్నారు.గనుక జ్ఞానాగ్నికూడా పదార్థమునునశింపజేయజా లదు.పవిత్రపరచి తిరిగితనలోనికే స్వీకరించును గనుకరహితముకాజాలదని తెలియవలెను అసలు జ్ఞానముగా, వనస్పు అనగా వస్తురూపముగా నేమిటి?క్షరరూపమనిగా నేమిటి? అని తెలియవలెను అసలు అక్షరము క్షరపను నశింపజేయునా? చేయక తనలోనే యుంచుకొనును గనుక క్షరాక్షరము లు ఒకదానిని విడివి ఒకటి వుండవనితెలియవలెను గనుక యిట్టి విధానములో పూర్వా పూర్వ సంచితరాశి ఎన్నటికిన్ని నశించదు. జన్మ లేకుండా పోదు దీనిని అచల ఋషులు తీర్మానించెదరు. కేవలము మాటలవలన, నస యితరులను కొందరుకాని అట్లుగాక సిద్ధాంత రూపముగా తేల్చివేయుదురు. ఈ విధాన మును గ్రహించవలెనన్న అచల ఋషులు సేవించి గురుభక్తికలిగి పై విషయములను రుజువుపరచు కొనవలయునేకాని నేటి విద్యావంతులు అట్టి గురువులను భక్తితో సేవిం చిన యెడల వారు కనివిని యెరుగని విధానము అందరి కంటే వారికి సులభముగా గ్రహింపులోనికి సాధనములు లేకనే లభ్యపడును. కాని వారు సరిగా గ్రహించక ఉత్తమ గురువులను చులకనగా చూచుచున్నారు. యిది హిందూదేశమున నవీనముగా పుట్టిన పొరపాటని తెలియవలెను.

ఇక 23వ తత్వమైన బుద్ధిని గూర్చి విచారింతము ఇందులో కూడ 1/8 వంతు ఆకాశ అంశమును తక్కినది అగ్ని యంశమును కలిగియుండుటచే "బుద్ధిః కర్మానుసారిణి" అను ఆర్యోక్తి ప్రకారము ఆకాశ అంశమునందు దాగియుండు

పూర్వ కర్మలు అగ్ని అంశముచే ప్రకాశించుటయు, అంధకారముచే యితర ఇంద్రియ ములతో కూడిన అధోగతిని పొందుటయో గలదు. దీనికి అధిపతి బృహస్పతి! యిది జ్ఞానాంశమైనందున యే విషయములోగాని బుద్ధిని అమిత తీవ్రముగా వుపయోగించి గొప్ప విషయములను స్వీకరించ గలరు, యిది మనస్సులో యేర్పడు సంస్కారములకు ఆధారమై యున్నది బుద్ధిని వికసింపచేయుటలో విజ్ఞానమునకును మందగింపచేయుటలో అజ్ఞానమునకు వీలగుచున్నది.

గీత. 2-40 శ్లో॥ నేహాభిక్రమ నాశోఽస్తి ప్రత్యవాయో నవిద్యతే।
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥

వ్యాఖ్య - జ్ఞానము నేనన నొక్కటే, "జ్ఞానమునే వేరటంచకనపోవకుము" అనే సిద్ధాంతరీత్యా బుద్ధియోగమను కర్మయోగము, జ్ఞానయోగమగు సాంఖ్యయోగము ఏక మేనని తెలియలేక రెండు విధములుగా నిర్ణయించి పాప పుణ్య రూపమగు సంసారబంధమున తగులుకొనుచున్నారు. జ్ఞానకర్మ సమన్వయ స్వరూపము తెలిసి ఆచరించు కర్మ యే మోక్షదాయకము గనుక అదిసంసార బంధమునుండి తప్పించును, ఈ యోగము కర్మను విడువకుండకనే, కర్తృత్వరహిత పద్ధతిగలదిగా నుండును

గీత. శ్లో॥ 2-41 వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహకురునందన!
బహుశాఖ హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్॥

తా॥ ఓ అర్జునా కర్మజ్ఞాన సమన్వయము చేసుకొన్నవారల నిశ్చయాత్మ - ఏకత్వముగా నుండును - కర్మజ్ఞానములు వేరనే వారల చిత్తము అనేక విధములుగా చంచలత్వమునొంది బహుముఖములుగా నుండును.

గీత. శ్లో॥ 2-46 యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే
తావాన్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥

తా॥ ఆకాశగంగయందు స్నానపానాదులొనర్చు వారికి భూలోకమందుగల కూపతటాక పుణ్యనదుల చక్రతీర్థ స్నానపానాదు లెట్లు ప్రయోజనహీనములో అట్లు జ్ఞానకర్మ సమన్వయ స్వరూప సమిష్ట్యంతఃకరణప్రవృత్తిగలవారికి వేదనిర్మిత కర్మఫలంబు అట్లు ప్రయోజన హీనంబులుగా నుండును గనుక,

గీత. శ్లో॥ 2-47 కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతుర్భూర్మాతే సంగోఽస్త్వకర్మణి॥

తా॥ అర్జునా కర్మచేయుటయే నీ విధి, కర్మఫలములయందు నెప్పుడూకూడా నీకు కోరికలుకలుగకుండుగాక యనినిన్నాశీర్వదించుచున్నాను యెందుకనగాకర్మఫలంబుల కోరికయే కర్మాచరణ యందు రక్తివిరక్తులు కలిగించుచున్నది. అందువలన కర్మఫల ప్రాప్తికి కారణముగావలదు. కర్మత్యాగము చేయవలెననియు ప్రవర్తించకుము.

ఇక 22వ తత్వమగు చిత్తమునుగూర్చి విచారింతము. ఇది జలభూతము యొక్క అంతరేంద్రియ తత్వము. యిందులో ఆకాశభూతము యొక్క 1/8 భాగమును మిగిలిన భాగము జలభూతము, జలభూతము యొక్క అదిదేవత విష్ణువనియు, చిత్తము యొక్క అదిదేవత క్షేత్రజ్ఞుడనియు ఆర్యుల నిర్ణయము, ఇచ్చట కృష్ణదాసుగారిచే రచింపబడిన ఒకక ందార్థమును తార్కాణముగా గైకొనెదము, యిచ్చట జన్మకు తావున్నదనియు తెలియగలరు అదియునుగాక జలభూతముయొక్క సమిష్టిస్థానము రసస్థానమై

కూడా నున్నది గనుక జన్మస్థానమనికూడ తెలియవలెను. యిచ్చట కూడ రహస్యమున్నది.

కం. అన్నపు సూక్ష్మాంశము మనుస్సె న్నగనీరంబు ప్రాణ మెరుగుము. ఈ రెండెన్నడుకలియవో నాడేసున్న సుమీ యెరుకమాట సుగుణసంపన్నా కలసుటే యెరుక సుమి యింతకన్నాపున్నది యెరుక మూలమన్నది. వినలేదు. యెన్నాడు, ఈ భ్రాంతి నిన్నంటనివ్వకు సుగుణసంపన్నా॥ కలసుటటెయెరుక సుమి యింతకన్నా

దీనిని సూక్ష్మాతి సూక్ష్మముగా పరిశీలించవలెను. జీవులు, పుట్టుటకు నీరు, భూమి, స్థానములుగా నున్నవి. ప్రస్తుతము నీటి స్థానమును గూర్చి విచారింతము నీరు అనగా $H_2O$ [అనగా నీటిలో 2 భాగములు అమ్లవాయువును, ఒక భాగము ప్రాణవాయువునున్నవని అర్థము. అందువలననే నీరంబు ప్రాణమని తెలియవలెను. ఇందులో మలినము లేనప్పుడు యే ప్రాణియు పుట్టదు, కారణమేమనగా వాయువు అమలముగా నున్నప్పుడు అనగా అందులో దుర్వాసనగాని సువాసనగాని కలియనప్పుడు అనగా విషయేంద్రియములచే యేర్పడిన యేలాంటి సంస్కారములు లేనప్పుడు నీటిలోనుండు కేవలము ఆ వాయువు తలలేని మొండెముగా నుండును. గనుక ఉత్పత్తి జరుగదు కాని ఇచ్చట నీటిలో కలిసియుండు గుణము, భూమి తాకిడి వలన, శబ్దస్పర్శరూప రస, గంధ గుణములతో కూడుకొనును. అట్టి తన్మాత్రాలతో కూడిన సూక్ష్మ కర్మ సంస్కారములు భూమి నుండి ఆ నీటిలో గల ప్రాణవాయువును ఆశ్రయించుటకు వీలై జననములకు ఆస్కారముగు చున్నది.

గనుక ఆ నీటిని ఆశ్రయించుకొని యుండు కర్మ సంస్కారములు ఎచ్చట

నుండి వచ్చినవనగా అన్నపు సూక్ష్మాంశములో నుండి యేర్పడినవి. ఎట్లనగా పృధివి తత్వములో నుద్భవించిన ఓషదులలోగల సూక్ష్మ కర్మ సంస్కార బీజములు గల అన్న రసమును నీటిలోని ప్రాణవాయువు మోసికొని పోవుచుండును అనగా నీటిలో కలిసి యుండును. అట్టి నీటిని, నీటిలో నుండు జలచరములు త్రాగుట వలన అందలి పై తెల్పిన అన్నరసపు శుక్ల శోణితములవలన జలచరములు నుద్భవించును. ఎట్లనగా భూమిపై నుండు ఓషదులు భుజించుట వలన స్త్రీ పురుషులు ఎట్లు గర్భము దాల్చుచున్నారో అలాగేనని తెలియవలెను దీనికి తార్కాణముగా భాగవతమునందు చూడుడు విష్ణుదేవుడు సముద్రమున శేషపాన్పు పై భార్యా సమేతముగా పవళించి సంకల్పముచే బ్రహ్మను తన నాభియందు గలకమలములో పుట్టించెనని చెప్పబడియున్నది. యిచ్చట అంతరార్ధమును మహాపురుషుల వ్రాతలను బట్టి విచారించిన తేటపడగలదు గనుక అచల ఋషులు పైరహస్యమును తెలిసికొనియుండుట చేత యెుకయొక్క మూలములేని తనమును నిరూపణచేసి పరిపూర్ణతను ఏసాధనలేని బోధవలన నిరూపణ చేయగలిగిరి.

కం॥ జలమందు మొదలు లేకనె జల చరములు పుట్టి పెరిగి నశిసిన రీతిన్ అల
పరిపూర్ణములోని విలసజ్జనంబుస్థితియు విలయములౌరా॥—

యిక 21 వ తత్వమగు అహంకారమును గూర్చి విచారింతము యీ తత్వమునకు దేవత రుద్రుడు అనియు పృధ్వీభూతము నకు దేవత బ్రహ్మయనియు పెద్దల నిర్ణయము. యీ తత్వము నందు, శబ్ధ, స్పర్శ, రూప, రస గంధములు గుణములుగా నున్నవి యిచ్చట ఓషదముల యందు అన్నరసము యుద్భవించుటకు

ఆస్కారమున్నదని గురువు వలన తెలియవలెను గనుక జీవుల ఉత్పత్తి లయములకు స్థానముగా నున్నది యిది స్థూల సూక్ష్మములుగా నుండుటం బట్టి స్థూల గుణము మూఢ శక్తి కలదై అహంకారమునకు ఎక్కువగా ఆస్కారము నిచ్చుచున్నది. సూక్ష్మ గుణములచే పూర్వజన్మ సంస్కారముల వలన మంచిగనో చెడ్డగనో నడుచు కొనుటకు ఆస్కారమున్నది యీ భూతముచే కలుగు అహంకారమును మానవుడు గురువులచే తెలిసికొని ప్రవర్తనను గ్రహించవలెను. సత్ప్రవర్తన వలన పుణ్యము అనగా బంగారు సంకెళ్ళు దుష్ప్రవర్తన వలన పాపము అనగా యినుప సంకెళ్ళు తగు ల్చుకొనును కాని అచల ఋషులచే వీటిని రెంటిని విడిచి ప్రవర్తించు విధానము గ్రహించి జన్మరహితము నొందవచ్చును.

యిక 20, 19, 18, 17, 16, తత్వములగు సమాన, వ్యాన ఉదాన, ప్రాణ, అపానములగు ప్రాణేంద్రియములైన వాయు భూతమునకు సంబంధించిన విధానము గమనింతము. వాయు భూతమునకు అధిపతి ఈశ్వరుడు

ప్రాణేంద్రియ పంచకము యొక్క పని చాలా ముఖ్యము పిండ బ్రహ్మాం డంబులయందు సర్వేంద్రియముల యొక్క పని సక్రమముగా జరుగుటకు వాటిని పరీ క్షింప వాటి గతికి ఆధారమై ప్రాణేంద్రియములున్నవి. సకలేంద్రియముల గతిని రక్షిం చివాటి నుండి వెలువడిన సూక్ష్మ కర్మ సంస్కారములను రక్షించుచూ పిండ బ్రహ్మాం డంబులయందు సంచరించి విలోమ అనులోమ క్రియలకు సహకారిగా నున్నది, యీ యింద్రియముల పనిని క్రింది విధముగా పెద్దలు నిర్ణయించిరి. సమాన రూపమున

భూమ్యాకాశ మధ్య భాగమునందు నియ్యది యుండును. వ్యాన రూపమున నిది సర్వము నందుండి జగత్తును ధరించును. ఉదాన రూపమున నిది తేజస్సు నందుండును. ప్రాణరూపమున నిది ప్రకాశమునందుండును అపాన రూపముననిది గంధములో నుండును సూత్రాత్మగా నిది సర్వమును ఆకర్షించుట. అగ్నిని మండించుట మేఘముల వర్షింపచేయుట, నక్షత్రములను, భూమిని, సూర్య చంద్రుల వాటి వాటి స్థానముల లో నుండునట్లు ఆకర్షణ ద్వారా నిలుపుట, స్థూల. సూక్ష్మ రూపమదు సర్వప్రపంచమును, ధరించి భరించు చున్నది పిండాండంబునందు అన్నపానాదుల జీర్ణింపజేయుట రక్తాదులను పరిసరింపజేసి శీతోష్ణ స్పర్శలను తెలియజేయుచుండుట పాయ్వుపస్థల యందుండి మలమూత్ర శుక్ల శోణితముల విసర్జింపజేయుట యీ విధంబుగా దేహమును ధరించి సూక్ష్మ కర్మ సంస్కారములను బ్రహ్మాండమునకు గైకొని పోయి మరల పిండాండమునకు గొని వచ్చుపని దీనిదై యున్నది.

15-8శ్లో॥ శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్॥

తా॥ ఓ అర్జునా! వాయువు, పుష్పములు మొదలగు సువాసనలుగలవస్తువుల నుండి బయలు దేరు నపుడు పుష్పముల నచ్చటనే విడిచి అందలి పరిమళములు గల పరమాణువుల నెట్లు తీసుకొని పోవుచున్నదో యట్లే దేహేంద్రియాది సముదాయమునకు ప్రభువగు జీవుడు కొంతకాలమొక దేహమునందుండి కర్మ వశము వలన యీ దేహమును వదలి మరియొక దేహమును పొందునప్పుడు దేహము నచట విడినను

దాని యందుండు మనస్సు మొదలగు ఆరు ఇంద్రియములను తీసికొనిపోవుచున్నాడు అనగా సంస్కార ఫలితములు జీవుని వెంబడించి పోవుచున్నవని తాత్పర్యము,

15-9శ్లో॥ శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ।
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే॥ గీత

తా॥ అర్జునా! జీవుడు, చెవి, కన్ను, చర్మము, నాలుక, నాసిక మనస్సు అనునట్టి యారీంద్రియములను పొంది శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులయిన విషయముల ననుభవించుచున్నాడని తాత్పర్యము. యిక 1 మొదలు 15 తత్వములను పరిశీలించిన జ్ఞాత. అంతరేంద్రియముల నెరిగి, శబ్ద, స్పర్శ, రూపరస, గంధములచే, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియముల ద్వారా ఏర్పడు కర్మ సంస్కారములు త్రిగుణములై. జీవి జనన మరణములలో జిక్కి, అనేక జన్మలు ఎత్తెడు అవకాశమున్నది. దీనికి భయపడి మానవ కోటి మంచి జన్మల కొరకు నానాబాధలు పడుచున్నారు. ధానము ధర్మము సగుణ ధ్యానము, ప్రతి మార్చనము, తత్ జపముతీర్థస్నానములు మొదలగునవి

కం. కొందరు దశవిధ నాదములందున, నభపంచకంబునందున, చక్రాలందున-
లక్ష్యధ్యానంబంగున హంసందుబుద్ధి నాటింతురోయీ, యోగములందు -
నటియింతురోయీ! అందీ సిద్ధుల చాత నానందింతురు. కొందరందారి మునుసీ,
బోధించె నీ వుండాము. నాటింతురోయీ యోగములందునటి యింతురోయీ॥

అనునట్లు నానావిధములుగా, దుఃఖమును బాపుకొనుటకై చేయుదురు. కానీ వీటివలని ఫలితములు నిష్ప్రయోజనమని తెలియవలెను. వీటి కొన్నింటివలన మంచి

జన్మలు కలిగినా ఒక్కొక్కప్పుడు నిష్ప్రయోజనమగును. మరల మానవ జన్మ కలుగునను నమ్మకములేదు. కలిగినను, మంచి గుణములతో భక్తుడై పుట్టుట అరుదు. గనుక పై విధానమంతయూ లేకనే అచల ఋషులు సులభమైన, చక్కని మార్గము అవలంభించినారు అట్టిమార్గము వలన తప్పక జన్మరహిత్యమగునని తెలియవలెను.

## 6. అచల ప్రకరణము

1. అన్ని ప్రకరణములలోని విషయములను బట్టి తేలినది ఏమనగా శ్రీ కృష్ణదాసుగారు సెలవిచ్చినట్లుగా "తత్వతతి యెరుకంచవినన్" అన్నారు. తత్వశాస్త్రజ్ఞులు వారి వారి పరిశోధనల వలన తత్వముల గుణములను శక్తులను తెలిసికొనిరి. దానిని బట్టి ద్రవ్యములు చైతన్య శక్తియొక్క స్థూల, సూక్ష్మ రూపముల వహించి, ఎల్లప్పుడు జనన మరణ పద్ధతులలో మారు చుండుననియు వాటి, యొక్క ఆవరణ భేధ గుణభేద శక్తి భేధముచేత, చేతనాచే తన శక్తివహించి తరతమ భేధమువహించి కారణ కార్యములుగా నడుచు చున్నవని తేలినవి. యీ సిద్ధాంతము కేవలము. తపస్సులో అను భవనములో, తత్వముల పరిశోధనలో, తేలిన సారాంశము. తత్వశాస్త్రజ్ఞులు దీనిని వారి తపోశక్తిచే, శృతులను అలకించి రుజువుచేసిచూపిరి. వీరు "నేను" అనగా ఎవ్వరు అని తెలిసికొనుటకై పయనించిరి. అట్టి ప్రయత్నములో నేతి నేతి మహావాక్యములచే ప్రజ్ఞానం బ్రహ్మ అను శృతి వాక్యము వరకు పయనించి వారివారికి తోచిన పద్ధతిని "నేను" రోఎవ నిర్ణయించినాను.

2. ఇక భౌతికశాస్త్రజ్ఞుల పరిశోధనల వలన తేలినది. యేమనగా, పదార్థము నశించదనియు ఒకరూపము నుండి ఇంకొక రూపమునకుమారి యితర పదార్థములతో కలసి దాని గుణశక్తులు ప్రజ్వరిల్లుచూ ప్రసరించు చుండుననియు అట్టి పదార్థమే మారణ పదార్థముగా నుండు నప్పుడు యితర పదార్థములకు వక్రగతి కలిగించుననియు. ఉపకారిరూపము వహించినప్పుడు వూహించనంతటి దిగ్విజయముగా పనులు జరుపుననియు, జీవుల రక్షణకు సౌకర్యములకు తగినదిగా నిలుచుననియు సృష్టినేకదల్చ్ర శక్తిని కనుగొన్నారనియూ తేలినది

3. ఇక అచల ఋషులు కనుగొన్నది యేమనగా పై రెండు విషయముల ఏకమేననియూ, అంతవరకు యదార్థమేననియూ పై సందర్భముల వలన జీవికి, సుఖ దుఃఖములు, జనన మరణములు, కలుగుచుండునేకాని విముక్తి మార్గము యిందులో లేదనియు, కారణమేమనగా:—

1. పై పదార్థమంతయు అలీన పదార్థమేనయు అనగా ఒక పదార్థములో అట్టిదే యింకొక పదార్థము కలియుచుండుచే కానీ శాశ్వతమైన వస్తువులో, లీనమగు లక్షణములు యిందులో లేనందున యిది అశ్వాశ్వతమైన, అలీన పదార్థమని సెలవిచ్చిరి

ఉదా:—

సీ॥ జలజ పత్రమునందు సలిలముంటనియట్లు అద్దమందున రూపమంటనట్లు కురద యా కుమ్మరి పురుగు కంటనియట్లు, నాజ్యంబు జిహ్వయందంటనట్లు। భువివింత పండుపై బొబ్బరంటని యట్లు, బలుచల్లలో వున్న గలయనట్లు చిత్రభానునకును చీక టంటని యట్లు నాకాశమున వాయువంటనట్లు బ్రహ్మవేత్తలు మాయా ప్రపంచమందు

నఖిల వ్యవహారములచేసి యటరధిపా ॥రమ్య॥

94 కం. జలరాసికి బుట్టువుగద జల చరములు వాటికవ్వే జనియించుగదా!
కలకాలమిట్లు బయలెరుకల గాంచిన సంశయంబు కడకేగుజుమీ॥—॥

2. యింకనూ పై అలీన పదార్థమునే. మిథ్యా పదార్థమని సెల విచ్చిరి. మిథ్యా పదార్థమనగా పారమార్థికముగా, మిధ్యయనియూ, అనాదిదికాదనియు మధ్య లోనే వచ్చి, మధ్యలోనే పోవుచున్నదనియూ టెంకాయలో నీళ్ళ యెలా వచ్చినవో అలా వచ్చి ఏనుగు మింగినవెలగపండు వలెపోవుచున్నదనియూ స్వప్నంలో పదార్థము ఏలా కనుపడి లేకుండా పోవునో అలా మిథ్యా పదార్థమని రుజువుపరచి దీనిలో చలన లక్షణములే, వుండుటం బట్టి అచలములో నుండుటకు అవకాశము లేదనియు, అచలమున్న అట్లు లేవనియు, రుజువు పరచిరి, యిందుకు వుదాహారణముగా, రజ్జు సర్ప భ్రాంతి, మృగజల భ్రాంతిని నిరూపణజేసిరి అట్లే ఉదా:—

64 కం. ఉన్నదిగదనే జెప్పనదన్నా దాన్నుండజూచి తలగుము మృషయా నన్నింటియున్న సంపదలన్నియునౌని నీవు వచ్చినట్లు మృషగుచున్!

3. ఇంకను పై మిథ్యాపదార్థమునకు మూలములేదని రుజువుపరచిరి దీనికి సత్యవస్తువు మూలమైనయెడల, ఇది కూడా సత్యముగా నుండవలెనుగదా సత్యాసత్యము లనే ద్వంద్వగుణము లేల వుండవలెను. అదియునుగాక సత్యవస్తువునకు యిది జన్మించి యున్నయెడల అంతయూ సుఖముగా నుండవలెనుగాని దుఃఖమెందుకు నుండవలె? 'జాతస్య మరణం ధ్రువం' అను వాక్యమును బట్టి దీనిని పుట్టించినదికూడా అట్టి వస్తువు

గానే వుండవలెనుగదా! అని శాశ్వతమైన వస్తువే కానందున మూలములేనిదని చెప్పవ లసి వచ్చినది ఈ సందర్భమున కృష్ణదాసుగారు యిలా సెలవిచ్చియున్నారు.

కం. తన మూలము తలిదండ్రులు తనవలెనే వారి వారి తలిదండ్రులకున్! తనవ లెనేగాని యన్యముగన కననస్థాన మొకటి కలదనతరమా! బ్రహ్మాదులకది తెలి యతరమా! వినుము ఈ బ్రహ్మాండ జనరాము నీ నాయందుననైన, దిదియుకా దని వేరే ఇంకొకటి కలవన తరమా బ్రహ్మాదులకది తెలియతరమా॥

అన్నారు కృష్ణదాసుగారు యిచ్చట నీ నా యందున అయినది అను విషయ ము గురువులన తెలియవలెను పాఠితరుగ మూలమేది?

86 కం. బ్రహ్మందు లేక కలిగిన బ్రహ్మనునేన నేటి మాయ ప్రబలెజగంబై! బ్రహ్మ ను గని తానే గుటె! బ్రహ్మననే మాయకు పని బ్రహ్మందుజుమీ!!

4. గనుక దీనిని అనగా మూలము లేని పదార్థమును శూన్యమనవలసి వచ్చినది అన్నారు. శృతి, 'ఆకాశం గగనం శూన్యం' శూన్య మనగా లేనిది అని అర్థ ము. ఒక విద్యార్థిని సున్న పెట్టమని చెప్పండి. అప్పుడువాడు గుండ్రముగా సున్నను పెట్టును. అప్పుడు అతనిని నీవు పెట్టినదియేమి అని అడుగగా సున్న అని జవాబిచ్చును సు న్న అనగా ఏమిటి అని అడుగగా యేమిలేనిదానిని సున్న అంటారు. అని జవాబిచ్చును సున్న యేమిలేనిదానికిగుర్తు అంటాడు ఐతే నీవు పెట్టిన సున్న దేనికి గుర్తుఅని ప్రశ్నించిన యేమి

లేని దానికి గుర్తు అని చెప్పను. గనుక గుర్తు ను సున్న అనగా శూన్యముగా నెంచవ లెను. గనుక యీ సున్నతో యేర్పడిన ప్రతి దానికి గుర్తు ండును, గుర్తు లేనిదే సున్న కుదురదు. గనుక అట్టి గుర్తే సాక్షియని గుర్తించేది. ఆకాశముశూన్యములో జ్ఞానమనే గుర్తు యేర్పడియున్నది గనుక గుర్తు శూన్యమని అచల ఋషులవలనతెలియవలెను. పరిపూర్ణములో లేనిది గనుక శూన్యమని తెలియవలెను.

దీనికి తార్కాణముగా బృహద్వాశిష్టము 95 పేజీలో "జ్ఞాన కర్మ రహితమైన ది. పరమతత్వం" యిది తత్వం వంటిదికాదు. 1 లక్ష్యం లేనిచోట, లక్ష్యం వుంటే అన్ని లక్షణాలే. లక్ష్యభ్రాంతి చేతనే అన్ని లక్షణాలు తోస్తున్నవి. అందుకే లోకంలో "గురి" యని కద్దు. లక్ష్యం యుండెనా అందుకే లక్ష్యం తనకు సూటిగా లక్షణమును కల్పిస్తుంది. లక్షణమంటే స్వరూపం (క్షరం) 1 లక్ష్యమంటే స్వరూపాని కల్పించేది (అక్షరం) లక్ష్యమే లక్ష్యం వున్నంతసేపు అనేక లక్షణాలు అనేక స్వరూపాలుతో చును అందుకే లక్ష్యం లక్షణం ఒక్కటే కార్యకారణాలకు భేదములేదు, కనుక భ్రాంతి కి మూలం అన్యోన్యం లక్షణమనే స్వరూపం లేకుంటే, లక్ష్యం శూన్యమే లక్ష్యం జ్ఞానం లక్షణం చేయునది కర్మలు జ్ఞానకర్మలు మోక్షసాధనాలని ప్రసిద్ధి। లక్ష లక్షణర హితం పరిపూర్ణం అన్నారు

సృష్టి యందు శృతి :- ఆకాశ శ్శరీర బ్రహ్మ - ఆత్మకు ఆవరణము ఆకాశముగా గ్రైకొన్నారుగదా! గనుక యిచ్చట అవరణమనునది ఆకాశము యొక్క స్థూలభాగముగా గ్రైకొనవలెను, యిక సృష్టి తిరోభాగము నొందినపుడు భూమి అవరణ ముగా గ్రైకొనవలెను, అనగా భూమియొక్క స్థూలభాగమును అవరణముగా గ్రైకొనవ

లెను యిక ఆకాశము యొక్క స్థూలభాగము భూమి యొక్క స్థూలభాగము సృష్టికి ఆవరణముగా గై కొని. యిక మిగత భాగముల అగమ తిరోభాగములుగా లెక్కించుటలో ఆకాశము యొక్క సూక్ష్మభాగమునుండి అగమనముచేసిన సృష్టి భూమి యొక్క సూక్ష్మ భాగమునుండి తిరోగమించును ఈ మధ్య జరుగు భూతముల యొక్క స్థూలసూక్ష్మ ములవలన యెట్టి విధానము కర్త వలన జరుగునో గురుముఖమున తెలియవలసిన విధానము,

కం॥ ఆవరణము నాకసము నిరావరణము నచలమనుచు యనిరి మహాత్ముల్ - ఆవరణము మితిగలిగిన - దావరణములేంది యమితమని తెలిసుకోరా। యీ రెంట్కి వేరని కనుక్కోరా - ఆవరణమునసే - నివారణమును జూచి యీ ఆవరణ మెడలీన - నావా లమాట లేదని కనుక్కోరా - యీ రెంట్కి వేరని కనుక్కోరా॥

Note : యీ గ్రంథ పఠనచే సృష్టి కర్త యొక్క రహస్యమును అవలీలగా తెలిసికొనగలరు తదుపరి సాక్షి స్వరూపమనగా నేమి తెలిసి, పరిపూర్ణము గురు సూచనచే సులభముగా తెలిసికొని దైవార్థయును చేసికొనగలరు.

అచల ఋషులు రెండు మంత్రములు నర్థ మంచినారు. అందులో మొదటి ద్వాదశాక్షరి మంత్రము. రెండవది శోడశాక్షరి మంత్రము రెండవ మంత్రమును పై ప్రకరణములో రుజువుపరచియున్నారు. యిక మొదటి మంత్రము పరిపూర్ణమునుగూర్చి తెలిపినది, పరిపూర్ణము పుట్టుక చావులేనిది, అమృత బీజం, అప్రమేయశక్తి!

## సత్యప్రబోధ విధానము

అయమాత్మతత్త్వ పశ్యాది జ్ఞానరహిత కీలకము కలమెలుకువను అంటదు, మెలుకుకలను అంటదు. మెలుకవ నిద్రను అంటదు. నిద్రమెలుకవను అంటదు. అదే విధముగా యెరుక పరిపూర్ణమును అంటదు యెరుక పరిపూర్ణమును జూపి తాను అందులో లేకుండాపోవును. పరిపూర్ణము పుట్టనిది. చావనిది రాకడ, పోకడ లేనిది. సకల దేశముల యందు, సర్వకాలముల యందు, సమస్త వస్తువుల యందు. మొదలు కొనలేక చలించక ఒక్క తీరుగా తనకు తానే స్వత సిద్ధమై సూదిమోపను కూడా సందులేనిదై యుండు దానిని కుంఠితముగాని వైకుంఠము, నిజస్వరూపము, అచలము, పరమపదము' గురు గుహ్యము, నిజస్వరూపము, అని నామకరణమిడిన జ్ఞానము, జ్ఞానాతీతమును గాంచి నంతనే లేకుండా పోవును. భగవత్ స్వరూపము శాశ్వితముగానుండును. అచల ఋషులే తార్కాణము. యివి వినాశము లేని విధానము సర్వకాలముల యందు పరిపూర్ణముగా నుండుటే విధానము సంచిత ప్రారబ్ధములు తొలగి బీజరహితమగు విధానము' అచల ఋషుల వలన తెలియబడవలెను ఒకమూటలోని బట్టలను ముడివేసి వున్నంతవరకు వున్నవి. ముడివిప్పి బట్టకుబట్ట పారవేసినప్పుడు మూట యెక్కడిది? లేదుగదా అని విమర్శచేసిన వారికి సంచితరాశి యిక ఎచ్చట దాగియుండును? గనుక పుట్టుటకు సంచితరాశి లేనందున యిక జన్మరాదు, వారు ఆ సంచితరాశిని యితర వస్తువులలోనికి లీనము చేయలేదు. మరిన్నీ కాల్చివేయలేగు. వారుచూపిన వస్తువు గనుక యిచ్చట జనన మరణములు గల, తనలెమి ధృఢము యేర్పడి జనన మరణములు లేకుండా పోవును యిది గురు రహస్యము. గురు కరుణ లేనిదే యీ పరిపూర్ణభావములోని రహస్యము తెలియబడదు.

## శ్రీ శివరామ దీక్షిత అచల ఋషి సాంప్రదాయ విహ్న విమర్శనా గ్రంథము

## సత్యప్రబోధ విధానము

కం॥ సంకల్ప జాలమనియెడి। యంకిలిలేనట్టి చోటు నరసిన యంతన్। సంకల్పము మాయమగున్। సంకల్పపు జగము నిల్వజాలునెయవలన్॥

పరిపూర్ణమును గూర్చి భావించుటతగదు సేవించు విధానము గ్రంథములలో తెలియబడదు. ఒక వస్తువును గూర్చి నల్లదనియూ, లావైనదనియు మొదలగు లక్షణములు తెలిపిన ఆ వస్తువును లక్షణములను బట్టి నిర్ధారణచేసిన పొరపాటుగా ఏర్పడును గనుక అచల లక్షణములు భావించినంత మాత్రమున పరిపూర్ణము తెలియబడదు. సద్గురువు మూలమున తెలిసికొనవలెను. అట్లుగాక వూహలతో తెలియుటకు ప్రయత్నము జేయుటతగదు అట్లు ప్రయత్నించిన వాతిని చేయబోయి కోతిని చేసినట్లగును.

198 కం॥ ధ్వని మొదలగు తన్మాత్రలు కనగొగగా లేశమైన గాన్పించినచోటును బట్ట బయలుగా ని ధ్వర్వనిముఖ తన్మాత్రలున్నా దాన్నెరుగకనూ। గని యీ యట్టి ఘనునీ సన్నుతి జేయ జనులాలాకు సఖ్యమించనరాదు విన్నరాదు॥

శ్లో॥ అశరీరము సర్వదా స్తి। శరీరం రహితంసదా
అయమేవ సద్యోము క్తి। అన్యథాభ్రమకారణం॥
నిత్యస్సర్వల్వగతస్తాణు రచలో౽యం సనాతన: గీత.

తా॥ అనగా ఎప్పటికి తాను చలించక నితరమును చలింపజేయక విశ్వంతరా ముల యందలి చలనమునకు అధార ఆధేయములు గాక వున్నదే పరిపూర్ణము.

జ్ఞేయవస్తు పరిత్యాగే విలయం యాతి మానసం మాన సేవిలయబయాతీ

శ్రీ శివరామ దీక్షిత అచల ఋషి సాంప్రదాయ విహ్న విమర్శనా గ్రంథము

సత్యప్రబోధ విధానము

కైవల్య మవశిష్యతే॥

తెలియ దగినది లేనప్పుడు మనస్సు నాశనము నొందు చుండగా బట్టబయలు శేషించును. ఆప్రకారము అచల పరిపూర్ణ బట్ట బయలు యొక్క నిర్ణయము, ఆగమ నిగమ ఉపనిషత్ సాగర మధినానంతరమున తేలిన సారమగు సచ్చిదానంద రహితమను అచల పరిపూర్ణ బట్ట బయలని నిరయము.

ఇతి శ్రీ, శివరామ దీక్షిత అచల గురుసాంప్రదాయకులగు బి బాలాజీశింగ్ గురువర్య విరచిత సత్యప్రబోధ విధానము సంపూర్ణము ఈ గ్రంథమును, చిత్తూరుజిల్లా శ్రీకాళహస్తి తాలూకా ఆరె గ్రామము నందుండుమద్గురు వరేణ్యులగు శ్రీ వగడాల వేంటేశ్వర స్వామి లస్వాములవారి అవధూతాశ్రమములో అంకిత మొనర్పబడినది.

సర్వం సద్గురు చరణా రవిందార్పణమస్తు!

## గ్రంథ విరాళ దాతలు

| | | |
|---|---|---|
| 1. | దాసానంద ఈపూరు శేషపాణిగారు | 1200/- |
| 2. | సత్యవేడు శ్రీమతి పుల్లామునెమ్మగారు నిర్మింపియుండు కృష్ణమందిర జ్ఞాపకార్థమై | 1000/- |
| 3. | ఆరెగ్రామంలోని అవధూతాశ్రమ జ్ఞాపకార్థము టీ. మునిరత్నంనాయుడుగారు | 1000/- |
| 4. | గరివిడి సత్యప్రబోధనాశ్రమం జ్ఞాపకార్థము కంబాల గురుమూర్తి దంపతులు | 500/- |

## శ్రీ శివరామ దీక్షిత అవధూత ఋషి సాంప్రదాయ విహ్వ విమర్శనా గ్రంథము
## సత్యప్రబోధ విధానము

శ్రీమతి చిన్నాంబ సమేత రావ ర్తి వెంకటసత్యం (మెట్టపల్లి)
శ్రీమతి వెంకటమ్మ సమేత కర్రి విశ్వనాథం (ఖిలాయి)
శ్రీమతి లక్ష్మీసమేత గుజ్జు నారాయణస్వామి (సత్యమూర్తి) ఇబ్రాహ్మపురం
శ్రీ దయానంద బైరి రాజయ్య (పెదతోనంగి)

5. వాడపల్లి ఆనందంగారు 200/-
6. తాడెపల్లి గూడెం అవధూతాశ్రమం తరపున 200/-
7. శ్రీ లక్ష్మీనారాయణరావు [బిలాయి] 100/-
8. సత్యప్రబోధ ఆశ్రమము తరపున
మదనంబేడు సక్కుబాయమ్మ 200/-
9. రిటైర్డు సబ్‌రిజిష్ట్రార్ శ్రీ టి. నటరాజశెట్టిగారు 116/-
10. శ్రీ సదానంద శెట్టి శీతారామార్యులు
11. పూర్ణాంబఎడగాల నారాయణమ్మ తరపున పరిపూర్ణ బీపురు పల్లి కంచయ్య 100/-
12. సి హెచ్ వీరాస్వామిగారు రాజులకొత్తపల్లి 200/-
13. శ్రీ కనిరెడ్డి హరికృష్ణారెడ్డి గారి తలపున
14. శ్రీ అడిగోపుల వెంకయ్యగారు 200/-
15. మేరాల మునిస్వామి కోటమంగాపురం 100/-
16. కె. క్రిష్ణయ్య టీచర్ కోటమంగాపురం 100/-
17. కె సుబ్బారాయుడు, అనంతపురం 100/-
18. బావన శంకరయ్య, సూలూరుపేట 100/-
19. శ్రీమతి గోవిందమ్మ Sub Rig!ster, రేణిగుంట 200/-
20. జొన్నాద శంకరంగారు 200/-

## శ్రీ శివరామ దీక్షిత అచల ఋషి సాంప్రదాయ విద్యా విమర్శనా గ్రంథము
## సత్యప్రబోధ విధానము

బి ధర్మారావు, బి నాగరత్నం, కొండా చంద్రయ్య, కొండా నీలమ్మ బర్లరాము లమ్మ, సమీను పాపారావు, సమీను విలాసమ్మ, పులాసి జానకీరావు, పులాసి రత్నాలమ్మ ఇబ్బాపురం, నందిక చంద్రమ్మ, గుజ్జు బాలయ్య, గుజ్జు కాసలమ్మ, తిప్పన ముత్యాలమ్మ ఉప్పార అచ్చమ్మ, దుక్క అప్పారావు, దుక్క నాగమ్మ, దల్లి అప్పన్న, రాములమ్మ కొదారిశింగి గిన్నె వసంతి, కళదెమ్మ గిన్నె పురుషోత్తం వారి అర్ధాంగి పూర్ణానంద సుగ్గుక్రిష్ణ, చెట్టెమ్మ, కోటింగినిలాపుపకాంబరం, లొద్దపుట్టి నీలాపురాలయ్య దమయంతి రంగాల మధనయ్య వీరమ్మ, రెడ్డి చల్లయ్య ఆసోములమ్మ ఆర్. మణిక్యమ్మ, తిప్పన ముత్యాలమ్మ, పరగటి తరిణమ్మ ఎన్. బైరమ్మ. మెదుగు మంచయ్య, రేణుకమత మెరుగు శ్రీరాములు. మెరుగు భారతి, గుజ్జు హరిబందు కీము డియాంబరు.

### [కర్నూలు] దాసానంద శ్రీ ఈపూరు శేషపాణిగారికి

### * కృతజ్ఞత *

తే॥ గీ॥
తత్త్వసంపన్నుఁడు సమాన ధార్మికుండు
సద్గురు జనవిధేయుండు, సదయుండు,
పావనంబైన "ఈపూరు" వంశవార్ధి
శీత కరుఁడు "దాసానంద" శేషపాణి॥

తే॥ గీ॥
మొదట ప్రోత్సహించియు, కృతి ముద్రణకును
ధనసహాయము నొసరించెఁదగినరీతి
వారినన్నయంబు బరమాత్మ ప్రగతి నరసి
చిరత రాశీస్సులోసఁగి రక్షించుగాత॥

గ్రంథకర్త

సత్యప్రబోధ విధానము

## అచల జెండా పాట

ఎగరాలి ఎగరాలి సద్గురుని జెండా!
ఎగిరి, బ్రహ్మాండాలు మిగలాలి జెండా ॥ఎ॥
పంచదశిభావంబు నెంచగాకల యంచు
షోడశీభావంబు శోధించగా లేదంచు
ద్వయదోషరహితమౌ ద్వాదశీభావంబు
నిత్యమై సత్యమై నిలచెనని చాటంగ ॥ఎ॥
పంచభూతములకు పంచమోక్షములకు –పంచతన్మాత్రలకు పంచకోశములకు
పంచలన్నియు మించి యెంచ శక్యముగాక
ప్రణవాక్షరము దాటి పైనిలిచెననివేగ ॥ఎ॥
శ్రీధరస్వాములు శివరామ దీక్షితులు
అవధూత వేంకటేశ్వర గురుస్వాములు
సత్యప్రబోధనార్య బాలాజెసింగు
అచల చిహ్నముతోడ నలరాడు మనజెండా ॥ఎ॥



## అచల ధ్వజప్రార్థన

అచలకేతనంస్మరామి సర్వలోక సన్నుతమ్
అచల మౌనిసంప్రదాయ చిహ్న చిత్రభాషితమ్॥
క్లేశ, బంధ, మోక్ష రహిత కేవలాత్మ బోధకమ్
శ్వేతవర్ణ సంయుతం విశేషలోకవ్యాపితమ్॥
గురురహస్య శోభితం సదాభవాబ్ధి తారకమ్
గురుపరంపరాగతం గుణత్రయాది నాశకమ్॥
శ్రీధరాత్మ ప్రేరితమ్ విశిష్ట శిష్యసేవితమ్
సద్గురు శివరామదీక్షిత ప్రమోదకారణమ్॥
వేంకటేశ్వరావధూత విమలమచల బోధితమ్
అమల సత్యబోధనార్య అచల చిహ్న కల్పితమ్॥
బ్రహ్మవిష్ణు శంకరేంద్రభావయామి సంతతమ్
భ్రాంతిరహిత దివ్యతేజ భావహీనభాసురమ్॥

# * గ్రంథకర్త పరిచయము *

పేరు : బి. బాలాజిసింగ్

జననము : తే 5-1-1907 ది

జన్మస్థలము : పాతవంగల్లు, కొడవలూరు మండలం, నెల్లూరు జిల్లా.

గోత్రము : భారద్వాజ సగోత్రము, రజపుత్రవీరులు.

తల్లి : శ్రీమతి గౌరమ్మ

తండ్రి : మాన్యశ్రీ లక్ష్మణసింగ్

విద్యాభ్యాసము : యస్. యస్ ఎల్. సి

సతీమణి : శ్రీమతి రాంబాయమ్మ

సంతానం : ప్రమీలాబాయమ్మ, సులోచనా బాయమ్మ, నారాయణసింగ్ జనార్ధనసింగ్.

వృత్తి : ఉపాధ్యాయుడు, ప్రాథమిక పాఠశాల, క్రొత్తవంగల్లు.

సద్గురువు : అచలదేశికేంద్రులు శ్రీ సచ్చిదానంద పగడాల వేంకటేశ్వరావధూత స్వాములవారు.

అభిరుచులు : సత్యప్రబోధము గావించుటకై పుస్తక రచన సాగించుట శిష్య ప్రశిష్యులకు అచలపరిపూర్ణ పరబ్రహ్మము నెఱింగించుట.

బిరుదములు : తత్వభౌతిక శాస్త్రసారూప్యవిశ్వధర్మ నిరూపణ సత్యప్రబోధనాచార్యులు అచల ఋషి సాంప్రదాయ విహ్న నిరూపణాచార్యులు

ఇతర గ్రంథములు ముద్రితములు :- 1) తత్వభౌతిక శాస్త్ర సారూప్యత విశ్వధర్మ నిరూపణ 2) జన్మరాహిత్యప్రబోధము.

